# కేరళతో సహా ఆహార మండలం

## కేంద్రనిర్ణయం

బెంగుళూరు, జూలై 9: ఆంధ్ర, మద్రాసు, కేరళ, మైసూరు రాష్ట్రాలతో ఆహారమండలాన్ని ఏర్పాటు చేయాలని భారత ప్రభుత్వం నిర్ణయించిందని తమకు తెలిపిందనీ, ఈవిషయమై త్వరలోనే ఉత్తర్వులు జారీ కాగలవనీ మైసూరు రెవెన్యూశాఖ మంత్రి శ్రీ యం. వి. పాటిల్ పత్రికా ప్రతినిధులతో చెప్పారు. ఈ మధ్య హైద్రాబాద్‌లో కేంద్ర ఆహారశాఖా మంత్రి శ్రీ జైన్ అధ్యక్షతను జరిగిన ఆహారశాఖా మంత్రుల సమావేశంలో ఈమండలాన్ని ఏర్పాటుచేయాలని నిశ్చయించారు. ఈ మండలం ఏర్పాటు వల్ల మైసూరులో ముఖ్యంగా బియ్యంధరలు తగ్గుతాయి. ఈ 4 రాష్ట్రాలు స్వయంపోషకత్వం సాధించేందుకు ఈమండలాన్ని ఏర్పాటుచేశారు. ఈ నాల్గింటిలోనూ ఆంధ్ర మిగులు రాష్ట్రం; మద్రాసు, మైసూరులు కొంతవరకు తరుగు ప్రాంతాలు, కేరళ మాత్రంచాలాతరుగు రాష్ట్రం. కాని మండలాన్ని తీసికొంటే ఇది స్వయంపోషకత్వ ప్రాంతం కాగలుగుతుంది. గోధుమల సరఫరాకు కేంద్రం హామీ ఇచ్చినందువల్ల, ఈ విషయంలో ఎలాంటి చిక్కూ లేదు. కాని బియ్యం పరిస్థితి అంత సంతృప్తికరంగా లేదు. ప్రస్తుతం మైసూరులోని కేంద్రబియ్యం నిల్వలు 8,000 టన్నులు ఉన్నాయి అన్నారాయన.

## ఎరువుల ధరలు ధాన్యం రూపంలో చెల్లించే ఏర్పాటు

విదేశాలనుండి బియ్యం తెచ్చుకొనడం కష్టంకావడంవల్ల, దేశంలో నే ధాన్యం ఉత్పత్తికి కేంద్రం ఒక పథకాన్ని రూపొందించింది. ఈ పథకం ప్రకారం ఎరువులు తీసికొనే రైతులు వీటి ధరలను పంట అనంతరం ధాన్యం రూపంలో చెల్లించవచ్చు. ధాన్యం పండించే రైతులకు ఎరువుల వంపకానికి కేంద్రం ప్రముఖ స్థానం ఇస్తోంది. ఇలా సరఫరా చేసిన ఒక మణుగు ఎరువులకు సుమారు ఒకటిన్నర మణుగుల ధాన్యాన్ని ఈయవలసి వుంటుంది. ఈ పథకం వల్ల ప్రభుత్వంవద్ద ధాన్యం చేరుతుంది. ఈ విధంగా వచ్చే ధాన్యంలో సగాన్ని రాష్ట్రాలలో ఉంచి, తక్కిన సగాన్ని కేంద్ర ధాన్యాగారానికి చేరుస్తారు. అని కూడా శ్రీ పాటిల్ తెలిపారు.

ఆహారధాన్యాల ధరలపై కంట్రోలు ఉండాలన్న కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ కృష్ణమాచారి సూచనను ప్రస్తావించగా అందుకు తాము అంగీకరించలేమన్నారు. ఇదివరలో కంట్రోల్ సమయంలో ఎన్నో బాధలు పడవలసి వచ్చింది. ఈ కంట్రోల్ విధానం చెప్పడానికి బాగానే వుంటుంది. కాని ఆచరణలో చాలా చిక్కులు, కష్టాలు వున్నాయి అన్నారు.

భూమిశిస్తుకు బదులు వ్యవసాయ ఆదాయంపై పన్ను విధించాలన్న శ్రీ కృష్ణమాచారి సూచనను కూడా ఆయన నిరాకరించారు. ప్రస్తుత భూమిశిస్తు విధానంలో కొన్ని లోపాలున్నా, అనేక శతాబ్దాలుగా ఈ పన్ను వున్నదనీ, ఇది మన దేశానికి అనుగుణంగా ఉందనీ అన్నారు. ఈ విషయమై పన్నుల పరిశీలక సంఘంకూడా విచారణ చేసింది. కాని ప్రస్తుత విధానాన్ని మార్చాలని వారు నిర్ణయించలేదు అన్నారు.

## కావలెను

అల్లవరం (తూ. గోదావరిజిల్లా) ఆంధ్రపత్రిక, సచిత్రవారపత్రిక, భారతులను వారి స్వంతబాధ్యతపై విక్రయించుటకు న్యూస్ ఏజెంటు కావలెను.

మేనేజరు, ఆంధ్రపత్రిక.

## శ్రీ వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాల, విజయవాడ.

ఇచట ఆయుర్వేదము లక్ష్య లక్షణ సమన్వితముగ బోధింపబడును. ఆయుర్వేదాలంకార, ఆయుర్వేదకళానిధి అను నీ కళాశాల బిరుదములు పొందినవారు గవర్నమెంటు రిజిష్ట్రేషనుకు అర్హులు. రూరల్ మెడికల్ ప్రాక్టీషనర్లు అగుటకు అవకాశములు గూడ కలవు. కనీసయోగ్యత S. S. L. C. లేక సంస్కృతమున నాటకాంత సాహిత్యము. ఇంటర్మీడియేట్లకు ప్రాధాన్యతగలదు. కొంది సీట్లు మాత్రమే కలవు. ప్రవేశతేది 25-7-57 వరకు పొడిగింపబడినది. దరఖాస్తుఫారములకును యితర వివరములకును ప్రిన్సిపాల్ గారికి వ్రాయవలెను.

## చిట్ టెండరు నోటీసు

విజయవాడలో మురికినీటి కాల్వలకు సంబంధించిన పనులకు స్టోన్‌వేర్ పైపులను సప్లయిను అమర్చుట,జాయింటు చేయుటకు మరియు క్లాసు II లోని III లోనికు మేన్‌హోల్సు, ఫ్లష్ టాంకులు మొదలగువాటిని నిర్మించుటకు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, పబ్లిక్ హెల్తు డివిజన్, పోస్టు బాక్సు నెం. 365, విజయవాడ-2 వారిచే 2-8-1957 సా॥ 3 గం॥వరకు లంప్‌సమ్ పద్ధతిపై సీల్డు టెండర్లు తీసుకొనబడును. ఇష్టమైన టెండరుదార్లు రు. 15 లు సుణియార్డరు ద్వారా పైఅడ్రసు వారికి టెండరు షెడ్యూల్సు ఖరీదు నిమిత్తమై చెల్లించవలెను. ఎర్నెస్టు సొమ్ము రు. 1500/- టెండరు షెడ్యూల్సు 16-7-1957 తిరువాత 25-7-1957 వరకు అమ్మకముకు లభ్యమగును.

కాటా సుబ్బారావు,
ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు.
(పి. హెచ్.) విజయవాడ.

# ప్రి-యూనివర్సిటీ విద్య

## విశ్వవిద్యాలయాల గ్రాంటుల సంఘం సహాయం అట్టేవుండదని దేశ్‌ముఖ్ వివరణ

మధుర, జూలై 8: ప్రీ-యూనివర్సిటీ విద్య అభివృద్ధికిగాను, కళాశాలలకు వాటికి విశ్వ విద్యాలయాల గ్రాంటుల కమిషన్ పుష్కలంగా సహాయం చెయ్యలేదని, అయితే మూడు సంవత్సరాల డిగ్రీ పద్ధతిని సుష్ఠుగా అమలు పరిచి, దృఢం చెయ్యడానికి 15 కోట్ల రూపాయల సహాయాన్ని మాత్రం చేయగలుగుతుందని ఆ కమిషన్ అధ్యక్షులు శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ నేడు ఇచ్చట అమెరికన్ కాలేజీలో మాట్లాడుతూ విశదం చేశారు.

ఈ 15 కోట్ల రూపాయల సహాయంలో, అంత సహాయమూ, ఈ కమిషన్ చేయదు. ఇందులో 5 కోట్లు కేంద్ర ప్రభుత్వం భరిస్తుంది. మరో 5 కోట్లు రాష్ట్ర ప్రభుత్వాలు భరిస్తాయి. ఆయా కళాశాలల యజమానులు 2½ కోట్లు ఇచ్చుకోవాలి. తక్కిన రెండున్నర కోట్లు ఈ కమిషన్ ఇస్తుంది.

శ్రీ దేశ్‌ముఖ్ నేడు ఇక్కడికి వచ్చారు. ఈ ఒక్క రోజులోను ఇక్కడవున్న 5 కళాశాలలను చూచారు. యజమానులతో మాట్లాడారు. అమెరికన్ కాలేజీలో విద్యార్థుల సభలో మాట్లాడుతూ ఈ విషయాలను గురించి, విద్యావంతుల నిరుద్యోగాన్ని గురించి, ఉపాధ్యాయుల జీతాల వ్యవహారాలను గురించి తమ అభిప్రాయాలను తెలియ జేశారు.

విద్యావంతులలో నిరుద్యోగాన్ని గురించి ప్లానింగు కమిషన్ పరిశీలన, నిర్ణయము, సిఫార్సులను గురించి మాట్లాడుతూ, శ్రీ దేశ్‌ముఖ్ ఈలా అన్నారు:

ఈ నిర్ణయాలలో కష్టంకల్గిస్తున్నవి కొన్ని వున్నాయి. అట్టివాటిలో మొదట చెప్పుకోతగింది ఇది. రెండో ప్రణాళిక అమలుజరిగిన తర్వాతకూడా ఇప్పుడు ఎంతమంది విద్యావంతులు నిరుద్యోగులైవున్నారో, అప్పుడు అంతమందే నిరుద్యోగులుగా వుంటారు. ఇప్పుడు 5 లక్షలమంది ఇటువంటి నిరుద్యోగులు వున్నారు. అప్పుడుకూడా అంతమంది నిరుద్యోగులై వుంటారు. అంటే, ఈ 5 సంవత్సరాల కాలంలో పెరిగే విద్యావంతులకు ఉద్యోగావకాశాలు లభిస్తాయి. వీరికి ఇట్లా ఉద్యోగాలు లభించడంకోసం, ప్లానింగుకమిషన్ కొన్ని కార్యక్రమాలను నిర్ణయించింది. విద్యావంతులయిన నిరుద్యోగులదృష్టిలో కొత్తమార్పును తీసుకురావడానికి ఇవి ఆలోచించబడినాయి. వీరికి ప్రత్యేకంగా శిక్షణ అవీ ఇప్పించి, ఇంజనీరింగులోనో, లేక ఇతరమైన వృత్తులలో ఉద్యోగావకాశాలు కల్పించాలని భావం.

ఇటువంటి కార్యక్రమాలను నడిపించడానికి, మొదట్లో 5 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టాలని ప్లానింగుకమిషన్ వారు అనుకుంటున్నారు. అయితే వీటికి ఖర్చు చాలా పెట్టవలసివుంటుంది. అదీకాక, ప్రణాళిక అమలుజరిగి పూర్తిఅవుతూ వస్తూవుంటే, ఉద్యోగావకాశాలు అధికం అవుతాయనే మాటు తక్కువ నాకు, అనిపిస్తోంది. మామూలుగా మనం ఉద్యోగాలు అనుకునే ఉద్యోగాలేగాక, స్వంతంగా పనిచేసుకుంటూ, జీవితాన్ని నడిపించుకొగల అవకాశం కల్గవచ్చు. అందువల్ల, ముఖ్యంగా, ఉద్యోగాలు కావలసినవారి మైఖరిలో మార్పు తీసుకురావాలి. దాన్ని తీసుకురాగల్గితే పరిస్థితిఅంతా మారిపోతుంది.

కళాశాలల్లో అధ్యాపకుల జీతాలు పెరగాలని, అవి పెరిగితేనేగాని విద్యాబోధనం సుష్ఠుగా జరగదని శ్రీ దేశ్‌ముఖ్ అన్నారు. ఇందుకోసం, విశ్వవిద్యాలయాల గ్రాంటుల కమిషన్, విశ్వవిద్యాలయాలు, కేంద్రప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వాలు పూనుకొని పని చెయ్యాలన్నారు.

పరీక్షల పద్ధతిలో కూడా మార్పు రావలసిన సమయం ఆసన్నమైందని శ్రీ దేశ్‌ముఖ్ ఈ సందర్భంలో సూచించారు. ఈవిషయమై చర్చలు జరిగాయని, ఇక అచర్చలవల్ల తేలిన అంశాలను ఆచరణలో పెట్టడం యోగ్యమని ఆయన అన్నారు.

కళాశాలల్లో బోధనాభాష, గా, ప్రాంతీయభాష, ఇంగ్లీషుభాష స్థానాన్ని ఆక్రమించుకోవాలంటే చాలా కాలం పడుతుందని, ఈ పని అంతా ఎట్లా చెయ్యాలో, ఎట్లాచేస్తే సాగుతుందో, అధికారులు ఆలోచించాలని అన్నారు.

## కేరళలో కాంగ్రెస్ కార్యదర్శి పర్యటన

### సంస్థ పునర్నిర్మాణంకోసం

వార్ధా, జూలై 9: కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ శ్రీమన్నారాయణ్ యీ 11వ తేదీన పాలఘాట్ వచ్చి ఆచార్య వినోబాభావేను కలుసుకొని గ్రామదాన్ ఉద్యమంపై చర్చలు జరుపుతారు.

కేరళలో కాంగ్రెస్ సంస్థ పునర్నిర్మాణానికిగాను వీరు రాష్ట్రంలో ఒక వారం రోజులు పర్యటిస్తారు. శ్రీ శ్రీమన్నారాయణ్ నిన్ననే కేరళకు బయలుదేరి వెళ్ళారు.

## దొంగబంగారం కొన్న రష్యన్ జ్యూ

అమృతసరం, జూలై 8: దొంగ బంగారం కొన్నాడన్న నేరానికి ఒక రష్యా జేళపు జ్యూ మతస్థుణ్ణి పోలీసులు యివాళ అనదపు జిల్లా మేజస్ట్రేటు న్యాయస్థానంలో హాజరు పరిచారు. మోషే బరూక్ అనే యీ జ్యూ బొంబాయిలో నివసిస్తున్నాడు.

తానొక్క రు 10లక్షలు, యిద్దరు వ్యక్తులు చెరి రు 10 లక్షల చొప్పున హామీయిస్తే, జామీనుమీద బరూక్‌ను విడుదల చేయవలసినదిగా మేజస్ట్రేటు ఉత్తరువుచేశారు. కాని యితడు జామీను దార్లను చూపించలేక పోవటం వల్ల యీ 21వరకు ఖైదులో ఉంచాలని న్యాయాధికారి ఆదేశించారు.

మోషే బరూక్, ఒక తుర్కీ అధికారి, మరొక అమెరికా వ్యాపారస్తుని వద్ద యీ బంగారాన్ని కొన్నారు.

ఈ విధంగా దొంగబంగారాన్ని కొనటంలో బరూక్ ఘనుడనీ, బొంబాయి న్యాయస్థానాల్లో యితనిపై అనేక అభియోగాలు విచారణలో ఉన్నాయనీ అధికారులు చెప్పారు.

## అస్సాం అంతటా భూకంపం

### వారంరోజుల్లో రెండవది

గౌహతి, జూలై 8: అస్సాం రాష్ట్రం అంతటా యీ ఉదయం ఆరు గంటలు దాటగానే భూకంపం సంభవించింది.

ఈవారంరోజుల్లో ఇది రెండవది.యీ భూకంపం తీవ్రత వేరువేరుప్రాంతాలలో ఒక్కొక్కవిధంగా ఉన్నట్లు వార్తలు వచ్చాయి.

షిల్లాంగ్‌లో తీవ్రంగా కంపించింది. గౌహతి, సిల్చార్, కరీంగంజ్, గోలాఘాట్ తదితర ప్రదేశాల్లో ఇది స్వల్పంగా ఉన్నదని తెలిసింది.

మణిపూర్ రాజధానినగరం అయిన ఇంఫాల్‌లోకూడా దీనిశాఖ కొంత కనిపించింది.

అయితే నష్టం సంభవించినట్లు మాత్రం ఇంతవరకు ఎలాంటి వార్తలు రాలేదు.

దీనికేంద్రం షిల్లాంగ్‌కు 120 మైళ్ల దూరంలో ఉన్నట్లు భూకంప విజ్ఞానానికి సంబంధించిన కేంద్ర పరిశోధనాలయం ప్రకటించింది.

## భారతీయ జీవిత విధానాల అవగాహన

### విదేశీ విద్యార్థులకు సైదీన్ హితవు

న్యూఢిల్లీ, జూలై 8: ప్రాచ్య విజ్ఞానంలో శిక్షణ పొందుతున్న విదేశీవిద్యార్థులు, భారతీయుల జీవిత విధానాలను అవగాహన చేసుకునేందుకు ప్రయత్నించి, వాటిని తమతమ దేశాల్లో ప్రచారంచేయాలని యీ శిక్షణ తరగతులను ప్రారంభిస్తూ కేంద్ర విద్యాశాఖ కార్యదర్శి డాక్టర్ కె. జి. సైదీన్ కోరారు.

సాంస్కృతిక సంబంధాల విషయంలో కృషిచేస్తున్న భారతీయసంస్థ యీశిక్షణను ఏర్పాటుచేసింది. ఈ తరగతులు యీ 15 తో సమాప్తమవుతాయి.

ఒకదేశంలోని మంచి విషయాలను గ్రహించటానికి ప్రయత్నిస్తే, ఆ దేశాన్ని చక్కగాఅర్థంచేసుకోవచ్చునని డాక్టర్ సైదీన్ సూచించారు.

## పశ్చిమ పాక్ మంత్రిత్వసమస్య

### తాను వచ్చేవరకు ఆగాలని సురావర్దీ

### అధ్యక్షునితో ప్రధాని అభిప్రాయభేదం?

కరాచీ, జూలై 9: పశ్చిమ పాకిస్తానులో అధ్యక్ష పరిపాలనను అప్పుడే తొలగించవద్దనీ, అక్కడ మంత్రివర్గ నిర్మాణం గురించి తాను వచ్చేవరకూ నిర్ణయించవద్దనీ, పాకిస్తాన్ ప్రధాని శ్రీ సురావర్దీ, గవర్నరు గుర్మానీని ఆదేశించినట్లు ముస్లింలీగ్ వర్గాలవారు చెపుతున్నారు.

రెండుమూడురోజుల క్రితం శ్రీ గుర్మానీతో మాడ్రిడ్ నుంచి శ్రీ సురావర్దీ టెలిఫోన్‌లో మాట్లాడుతూ ఆదేశించారట. ముస్లింలీగ్ నాయకుడు శ్రీ దౌల్తానా కూడా శ్రీ సురావర్దీతో మాట్లాడారట. శ్రీ సురావర్దీ తిరిగి వచ్చేవరకూ, కేంద్ర మంత్రిమండలి పునర్విచారణ చేసేవరకూ మంత్రివర్గం ఏర్పడదని లీగ్ వర్గాలవారు నమ్మకంగా చెపుతున్నారు.

కాని రిపబ్లికన్‌పార్టీ వర్గాలవారు, ఈ నాలాంతింలో తమ ప్రభుత్వం ఏర్పడుతుందనే నమ్మకంలో సన్నాహాలు చేసేస్తున్నారు. డా॥ ఖాన్ సాహెబ్ స్థానే రిపబ్లికన్ పార్టీ నాయకుడుగా ఎన్నికైన సర్దార్ అబ్దుల్ రషీద్ మంత్రివర్గంలో ఎవరెవరిని చేర్చుకోవాలనే విషయంపై తన పార్టీ సభ్యులలో మంతనాలు సాగిస్తున్నారు.

ఈ వారం వచ్చి చూడవలసిందని గవర్నర్ గుర్మానీ అడగడమే చాలు, శ్రీ రషీద్‌ను మంత్రివర్గం నిర్మించమని ఆహ్వానించినట్లే అని రిపబ్లికన్‌వర్గాలవారంటున్నారు.

పశ్చిమ పాకిస్తాన్ రాజకీయ సమస్యలో పాకిస్తాన్‌లో కొత్త రాజకీయ పరిణామాలు కానవస్తున్నాయని రాజకీయ పరిశీలకులు అంటున్నారు.

రిపబ్లికన్ పార్టీకి పశ్చిమ పాకిస్తాన్ శాసనసభలో సంఖ్యాధిక్యత ఉన్నదనీ ఆ పార్టీ మంత్రివర్గాన్ని పునరుద్ధరించవచ్చునని అధ్యక్షుడు శ్రీ ఇస్కందర్ మీర్జా అభిప్రాయపడుతున్నట్లు కొంతకాలంగా తెలుసుట. కాని ఇప్పుడు ప్రధాని శ్రీ సురావర్దీ విరుద్ధ అభిప్రాయంతో ఉన్నట్లు చెపుతున్నారు.

ఇంక ఎవరి సంకల్పం క్రియారూపం దాల్చగలదో కనిపెట్టి చూడతగ్గ విషయం.

## అంట్రూ జలవిద్యుత్ పథకం

### ఫజలాలీచే ప్రారంభోత్సవం

షిల్లాంగ్, జూలై 9: అస్సాం రాష్ట్రంలో రు 2 కోట్లు వ్యయంతో నిర్మాణం అయిన అంట్రూ జలవిద్యుత్పథకానికి గవర్నర్ సయ్యద్ ఫజలాలీ యీ వాళ ప్రారంభోత్సవం జరిపారు. ఇది గౌహతికి 18 మైళ్లు దక్షిణంగా కల్లాంగ్ ఉపనది అయిన అంట్రూపై నిర్మితం అయింది.

శ్రీ ఫజలాలీ యీ ప్రాజెక్టును ప్రారంభించే సమయంలో వందలకొలది గిరిజనులు, తదితరులు పాల్గొన్నారు.

కొలంబో పథకంక్రింద కెనడా సహాయంతో ఈ ప్రాజెక్టు పూర్తిఅయింది. గవర్నర్ దీనిని ప్రారంభించే ముందు, భారత దేశంలోని కెనడా హైకమీషనర్ శ్రీ చెస్టర్ రోనింగ్, తమప్రభుత్వం తరపున లాంఛనంగా యీ పథకాన్ని, గవర్నర్‌కు బహూకరించారు.

దీనిమూలంగా 84 వందల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి రాష్ట్రానికి అదనంగా లభిస్తుంది.

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ బిష్ణురాం మేధి మాట్లాడుతూ,అస్సాం ఆర్థికాభివృద్ధికి గాను జరుగుతున్న కృషిలో ఇదొక మైలురాయి వంటిదని పేర్కొన్నారు.

ఈ ప్రాజెక్టు నిర్మాణానికి కెనడా ప్రభుత్వం, విద్యుత్పరికరాలతో పాటు ఇంజనీర్లనుకూడా పంపించింది.

## నేపాల్ మంత్రివర్గ రాజీనామా

ఖాట్మండూ, జూలై 9: నేపాల్ ప్రధానమంత్రి శ్రీ టంకా ప్రసాద్ ఆచార్య గత ఆదివారం రోజున శ్రీ మహేంద్రను కలుసుకొని తన మంత్రివర్గ రాజీనామాను సమర్పించారు.

తిరిగి ఉత్తర్వులు జారీ అయ్యేవరకు పదవులలో ఉండవలసినదిగా రాజు తమను కోరారని శ్రీ ఆచార్య అన్నారు.

ప్రజాస్వామికమైన ఐక్యత కోసం తమ పార్టీ కృషి చేసిందనీ, కాని వివిధ రాజకీయ పక్షాలలో ఉన్న స్వార్థపరులు, తదితర అభివృద్ధినిరోధకులు తమ సంకల్పాన్ని భిన్నంచేశారనీ కూడా వీరు తెలియజేశారు.

కొత్త మంత్రివర్గం రాజీనామా విషయంలో శ్రీ ఆచార్య పట్టువలగా ఉన్నందువల్ల రాజు, యితర నాయకులతో రాయబారాలు సాగిస్తున్నారు.

## అ॥ భా॥ ఖాదీ, గ్రామోద్యోగసంఘ సమావేశం

వార్ధా, జూలై 8: సమాజవికాస కార్యక్రమాలను పురస్కరించుకొని కేటాయించిన మొత్తాలలో 50% మొత్తాన్ని, ఆ ప్రాంతాలలో ఖాదీ అభివృద్ధికి ఖర్చుపెట్టేందుకుగాను తమకు ఇప్పించవలసిందిగా అఖిలభారతఖాదీ, గ్రామపరిశ్రమల సంఘం వారు, ఖాదీకమిషన్‌వారిని కోరారు.

ఈ సంఘం సమావేశం నిన్న జరిగింది: ఖాదీ పరుకుమీద పన్నులు వెయ్యడం మానుకుంటున్నందుకు వీరు, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాన్ని అభినందించారు. తక్కిన రాష్ట్రాల ప్రభుత్వాలుకూడా ఇట్లా చెయ్యడం లేదన్న భావాన్ని వీరు వ్యక్తంచేశారు.

## బందిపోట్లతో దొమ్మీలో 5 గురి మృతి

ఫిరోజ్ (గీహోర్) జూలై 8: ఇక్కడికి సమీపంలోని జమునా అనే గ్రామంలో బందిపోటు గొంగులకు గ్రామస్థులకు మధ్య దొమ్మీ జరిగి అయిదుగురు గ్రామీణులు మరణించారు. వలుగురికి గాయాలు తగిలాయి.

ఉభయపక్షాలు తుపాకులుపేల్చారు. దొంగల్లో ఎందరు మృతిచెందినదీ తెలియటంలేదు.

# ఐక్యరాజ్యసమితి పార్లమెంటు పద్ధతులు అనుకరించాలి

## మెంజీస్ సూచన: సంస్థలో ప్రాతినిధ్యం విధానంకూడా మారాలట

లండన్, జూలై 8: ఐక్యరాజ్యసమితి ఇప్పటి మాదిరిగా కాకుండా సమావేశ వ్యవహార విధానంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్య విధానాలను అనుకరించాలని, ఆస్ట్రేలియా ప్రధాని శ్రీ రాబర్ట్ జి. మెంజీస్, ఒక సూచన చేశారు.

సమితిలో పెద్దదేశాలకూ, చిన్న దేశాలకూ ఒకే రీతి ప్రాతినిధ్యం ఉండేపద్ధతి బాగుంటలేదని శ్రీ మెంజీస్ అన్నారు.

ఐక్యరాజ్యసమితి వ్యవహారసరళిని, ముఖ్యంగా సూయజ్ సమస్య సందర్భంలో వ్యవహరించినతీరుని శ్రీ మెంజీస్ విమర్శించారు.

అయితే సమితి వ్యవహార విధానాన్ని బాగుచెయ్యడానికి చెయ్యవలసినంత ప్రయత్నం చెయ్యాలేకాని, ఆశ్ట్రేలియా నిస్పృహ నిరుత్సాహాలకు లోనైతే, బాధ్యతలకంటె అధికార బలప్రభావానికి లోనయ్యేవారిని స్వేచ్ఛగా ప్రవర్తించడానికి విడిచిపెట్టేసినట్లవుతుంది. దీనివల్ల సమితి నిరర్థకం కావడంతో పోదు, ప్రమాదకరంగా పరిణమిస్తుంది కూడా.

సూయజ్ విషయంలో ఇదివరలో వెలిబుచ్చిన అభిప్రాయాలకు తాము పశ్చాత్తాపం చెందవలసిన అవసరం లేదని శ్రీ మెంజీస్ అన్నారు.సూయజ్ సమస్యలో సమితి తొందరపాటుగా, అక్రమంగా వ్యవహరించిందన్నారు.

సూయజ్ కాలువకంపెనీని జాతీయం చెయ్యడం, అంతర్జాతీయ న్యాయ ప్రాథమిక సూత్రాల అతిక్రమణ కాదూ అంటే, ఇంక అంతర్జాతీయ న్యాయం అనేదే లేదనుకోవాలి అన్నారు,

### రెండురకాల నీతిప్రమాణాలు

ఈజిప్టుపై ఇజ్రేల్ దాడి, హంగరీలో రష్యన్‌సైన్యాల జోక్యం ఈ రెండుసమస్యల విషయంలో సమితి రెండువిధాలైన నీతి ప్రమాణాలతో వ్యవహరించిందని శ్రీ మెంజీస్ ఆరోపించారు.

సమితి కార్యవిధానమే సక్రమమైనది కాదు. అందరికీ న్యాయం చేకూర్చే ఆశయం ప్రాతిపదికగా కార్యవిధానాన్ని మార్చి రూపొందించాలి.

ఐక్యరాజ్య సమితిని ప్రపంచానికి పార్లమెంటు అని చెపుతున్నప్పటికీ, ప్రజాస్వామ్యం అనే మాటకు కల అర్థం ప్రకారం మాత్రం అది పార్లమెంటు కాదు.

అనేక విధాల ఎంతో అభివృద్ధి చెంది, 16 కోట్ల జనాభాకల అమెరికా వంటి దేశానికి సమితిలో ఒకటే వోటు, ఇంకా ఆదిమదశలో ఉంటే అతి చిన్న రాజ్యానికి జనాభా కొద్ది లక్షలే అయినా, ఒకటే వోటు.

అయితే సమితిలో వోటింగు విధానాన్ని సంస్కరించడం సులభం కాదు. కాని కొత్త వోటింగు విధానం గురించి ఒప్పందం కుదుర్చుకుంటే తప్ప, అంతవరకూ సమితిలో రాజ్యాలు స్వయంగా ఒక నిర్బంధం అనుసరించడం అవసరం.

వోట్లు బలం కోసం రాజ్యాలు గుంపులు కట్టుకోడం మానెయ్యాలి.

పెద్ద బాధ్యతలు భారాలుకల రాజ్యాలు చెప్పే మాటలను భక్తితో విని, వాని అభిప్రాయాలను నిష్పక్షపాతంతో గమనించడం అవసరం అని, చిన్న రాజ్యాలు గ్రహించాలి.

సమావేశాలకు ముందు తెలిపి తగిన వ్యవధి ఇవ్వడం, తీర్మానాలను కూడా ముందు తెలిపి తగవ్యవధి ఇవ్వడం, చర్చకు చాలినంత అవకాశం ఇవ్వడం మొదలైన పార్లమెంటరీ కార్యవిధానాలను ఉచితమైనవానిని సమితి అనుసరించాలని శ్రీ మెంజీస్ అన్నారు.

## రెండవ ప్రణాళికలో 80 అభయ గృహాలు

### రు 6 కోట్ల వ్యయంతో నిర్మాణం

అహమ్మదాబాద్, జూలై 7: రెండవ ప్రణాళికలో సాంఘిక సంక్షేమ పథకంక్రింద భారత ప్రభుత్వం, సాంఘిక సంక్షేమ మండలి సహకారంతో 80 అభయ గృహాలను నిర్మిస్తుంది. జిల్లా కేంద్రాలలో 324 గృహాలను ఏర్పాటు చేస్తారు. ఈ గృహాల నిర్మాణానికి రు. 6కోట్లు ఖర్చు అవుతుందనిఅంచనా వేశారు.

దేశంలోని నైతిక, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులలో పాటు, యీ రంగంలో ప్రజలకు లభిస్తున్న సహాయ సహకారాలను పరిశీలించేందుకు సంక్షేమ మండలి రెండు సంఘాలను నియమించింది.

ఈసంఘం సిఫార్సులకు అనుగుణంగా ప్రభుత్వం యిప్పుడు తలపెట్టిన అభయ గృహ నిర్మాణ పథకం తయారైంది.

బొంబాయి రాష్ట్రంలో 5 పెద్ద గృహాలను, 22 చిన్న గృహాలను ఏర్పాటు చేస్తారని రాష్ట్ర సంక్షేమ సలహామండలి అధ్యక్షురాలు శ్రీమతి పుష్పా తె. మెహతా తెలియజేశారు.

ఈ గృహాల పర్యవేక్షణలో సంక్షేమ యిచ్చేందుకు పథకాలు పూర్తి అయినాయి.

## ఆహారధాన్యాల ధరల పరిశీలన

### విచారణసంఘంచే ప్రశ్నావళి ప్రకటన

న్యూఢిల్లీ, జూలై 9: ఆహార సమస్యకు సంబంధించిన వివిధ విషయాలపైనా వివరాల సేకరణకు శ్రీ అశోక మెహతా అధ్యక్షతను ఏర్పాటయిన అహారధాన్యాల ధరల విచారణ సంఘం ప్రశ్నావళిని ప్రకటించింది. ఈ సంఘం గత రెండు రోజులుగా జరిపిన సమావేశంలో ఈప్రశ్నావళిని రూపొందించింది. ఇందు ఇరవై రెండు విషయాలకు సంబంధించిన ప్రశ్నలున్నాయి. ఆహార పరిస్థితిని ప్రత్యక్షంగా తెలిసికొనేందుకు ముఖ్యంగా తరుగు, మిగులు రాష్ట్రాలలో పర్యటన చేయాలని ఈ సంఘం నిశ్చయించింది.

రాష్ట్రాలలో అధికోత్పత్తికి తీసికోవలసిన చర్యలు, రాష్ట్రాలలోని వివిధ ప్రాంతాలలోను అధిక ధరలకు సంబంధించిన భేదాలు, ఈ అధిక ధరలకు కారణాలు, ఆహార ధాన్యాల విక్రయ పద్ధతులు, వ్యవసాయదారులకు ఆర్థికసహాయం చేస్తున్న రీతులు మొదలయిన విషయాలతోను ఈ ప్రశ్నావళిని రూపొందించారు. దీనికి తోడు అహారోత్పత్తిపై భూసంస్కరణల ప్రభావం, తరుగు ప్రాంతాలకు సరఫరా చేసే నిమిత్తం కొన్ని మిగులు ప్రాంతాలలో ఆహారధాన్యాల నిర్బంధ సేకరణ, అహార ధాన్యాలు నిల్వలు చేయాలనే భావంతగ్గడానికి తీసుకోవలసిన చర్యలను గురించి కూడా ఇందులో పొందుపరిచారు.

అధికాహారోత్పత్తిని సాధించేందుకు వివిధరకాల ఆహార ధాన్యాలకు కనీస ధరలను నిర్ణయించి, ఆ ధరలకు ప్రభుత్వం ధాన్యాలను కొనడం వాంఛనీయము, యుక్తము అని భావిస్తున్నారా? ఐతే, అలాంటి కనీసధరలను తక్షణమే నిర్ణయించాలా? లేక, ధరలు తగ్గుముఖం పట్టినప్పుడు ప్రకటించాలా? అదీకాక, ఆహారధాన్యాల ధరలు విపరీతంగా తగ్గిపోకుండా ఉండేందుకు, ఈ కనీస ధరల నిర్ణయం అంటూ లేకుండా ప్రభుత్వం ధాన్యాల ధరలకు సంబంధించిన ఒక ప్రశ్న ఉంది.

ఇకముందు కూడా బియ్యం లోటు రాకుండా ఉండే దృష్ట్యా, బియ్యం వాడకప్రాంతాలలో గోధుమను అధికంగా వాడే విధానాన్ని అవలంబించేందుకు సూచనలను కూడా ఈసంఘం కోరింది.

ఆగస్టు 1వ తేదీనుండి ఈ సంఘం పాట్నా, కలకత్తా, గౌహతి, కటక్ లను జర్పి, 11,12తేదీలలో విజయవాడలోను, 13, 14 తేదీలలో హైదరాబాదులోను ఉంటారు అనంతరం బెంగుళూరు, మద్రాసు, తిరువేంద్రం, బొంబాయి వెడతారు ఇతరరాష్ట్రాలలోని పర్యటన వివరాలను తరువాత ప్రకటిస్తారు.

ఆహారధాన్యాల ధరలను గురించి ఆసక్తిగల సంస్థలు, వ్యక్తులు ఈ ప్రశ్నావళికి సమాధానాలను సాధ్యమైనంతత్వరలో, ఈసంఘం ఆయా రాష్ట్రాలలో పర్యటనకు ముందు నివేదిక రూపంలో అందజేయాలని ఈ సంఘం కోరిందని కేంద్ర ఆహారశాఖ ప్రకటించింది. ఈ నివేదికలను ఈ సంఘకార్యదర్శికి (ఢిల్లీ) పంపాలని కూడా ఈ ప్రకటనలో పేర్కొన్నారు.

రాష్ట్ర ప్రభుత్వాలు, రాజకీయ పక్షాలు, శాసనసభ్యులు, వ్యాపార సంస్థలు, వినియోగదారుల సంస్థలు, సహకార సంస్థలు మున్నగువారితోనే కాకుండా, ఈ నివేదికలు సమర్పించిన వ్యక్తులతోకూడా ఈ సంఘం చర్చిస్తుంది. ఈసంఘం ఎదుట సాక్ష్యం ఈయదలచినవారు ఆయా రాష్ట్రాల ప్రధాన కార్యదర్శుల ద్వారా ఈ ఏర్పాటుచేసికోవలసిఉంది.

## సాలజార్ ఫ్రాంకోల సమావేశం

లిస్బన్, జూలై 9: పోర్చుగీసు అధ్యక్షుడు శ్రీ సాలజార్, స్పెయిన్ నియంత ఫ్రాంకోను కలుసుకోనేందుకు, స్పెయిన్ సరిహద్దున ఉన్న సియుడాడ్ రోడ్రిగో పట్టణానికి వెళ్ళారు. ఈ విషయం సోమవారం రాత్రి లిస్బన్‌లో అధికారవర్గాల ద్వారా తెలిసింది.

వీరి సమావేశం ఎందుకో మాత్రం తెలియదు.

క్రీడా రంగం:

# మూడవ క్రికెట్ టెస్ట్ డ్రా

## వెస్ట్ ఇండీస్ తరపున స్మిత్ 168 పరుగులు

నాటింగ్ హామ్, జూలై 9: వెస్ట్ ఇండీస్ బాట్స్‌మన్ ఓ. జి. స్మిత్ 2వ ఇన్నింగ్సులో 168 పరుగులు చేసి, మూడవ క్రికెట్ టెస్ట్‌లో తమ జట్టు ఓటమి చెందకుండా ఉండడానికి తోడ్పడినారు. మూడవ టెస్ట్ ఈ రోజున డ్రా అయినది.

ఇంగ్లండ్‌కు వెస్ట్ ఇండీస్‌కు జరిగిన మొదటి టెస్ట్ డ్రా అయినది. రెండవ టెస్ట్‌లో ఇంగ్లండ్ గెలుపొందినది.

వెస్ట్ ఇండీస్ జట్టు నేడు రెండవ ఇన్నింగ్సులో 367 పరుగులకు అవుటు అయ్యారు. ఇంగ్లండ్ గెలుపొందడానికి మిగిలిన గంట కాలంలో 121 పరుగులు చేయవలసి వచ్చినది. కాని ఇంగ్లండ్ జట్టు రెండవ ఇన్నింగ్సులో ఆటముగిసే సమయానికి ఒక వికెట్ నష్టానికి 64 పరుగులు మాత్రమే చేయగలిగారు.

వెస్ట్ ఇండీస్ రెండవ ఇన్నింగ్సులో స్మిత్, అట్కిన్సన్ కలిసి ఆరవ వికెట్‌కు 105 పరుగులు చేశారు. ఈరోజు ఆట ప్రారంభమైన 45 నిమిషాలకు అట్కిన్సన్ 46 పరుగులకు అవుటు అయ్యారు. తరువాత ఏడవ వికెట్‌కు స్మిత్, కాప్టన్ గొడ్డార్డ్ కలిసి 154 పరుగులు చేశారు. ఇది ఈ వికెట్‌కు వెస్ట్ ఇండీస్‌కు 'రికార్డ్' 1934-35 లో వెస్ట్ ఇండీస్ తరపున వెంకిన్స్, గ్రాంట్ కలిసి ఈవికెట్‌కు 147 పరుగులు చేశారు.

ఏడుగంటలసేపు బాట్ చేసిన స్మిత్ అవుటు అయిన తరువాత త్వరలోనే వెస్ట్ ఇండీస్ రెండవ ఇన్నింగ్సు సమాప్తమైనది. ఇంగ్లండ్ బౌలర్లలో స్టాథామ్ 118 పరుగులకు 5 వికెట్లు! ట్రూమన్ 80 పరుగులకు 4 వికెట్లు! లేకర్ 98 పరుగులకు ఒక వికెట్ తీసుకొన్నారు.

స్కోరు వివరాలు: ఇంగ్లండ్: మొదటి ఇన్నింగ్సు: 6 వికెట్ల నష్టానికి 619 పరుగులుచేసి ఇన్నింగ్సు ముగిసినట్లు ప్రకటించారు. రెండవ ఇన్నింగ్సు ఒక వికెట్ నష్టానికి 64 పరుగులు.

వెస్ట్ ఇండీస్: 372, 367.

## రత్నం మెమోరియల్ చతురంగటూర్నమెంటు

మద్రాసు, జూలై 10: చెన్నపురి ఆంధ్రమహాసభ నిర్వహిస్తున్న రత్నం మెమోరియల్ వార్షిక చతురంగ టూర్నమెంటులో పాల్గొన గోరువారు దరఖాస్తులు పంపడానికి వ్యవధి ఈ నెల 14వ తేదీవరకు పొడిగించడమైనది. ఈ టూర్నమెంటు జూలై 15న ప్రారంభం అవుతుంది.

## హైదరాబాదు క్రికెట్ సంఘాధ్యక్షుని ఎన్నిక

హైదరాబాదు, జూలై 9: పార్లమెంటు సభ్యుడు రాజా రామేశ్వర రావు హైదరాబాదు క్రికెట్ సంఘ అధ్యక్షుడుగా ఈరోజున తిరిగి ఎన్నికైనారు. ఉపాధ్యక్షులుగా మేజర్ ఎస్. కె. గురుస్వామి, శ్రీ హరిప్రసాద్, కార్యదర్శిగా శ్రీ ఎస్. అబ్బాసీ, కోశాధికారిగా శ్రీ సి. ఎస్. సత్యనారాయణ ఎన్నికైనారు.

## గోవావిముక్తికి పోలీసు చర్య

నెల్లూరు, జూలై 7: శాంతియుత సత్యాగ్రహం లేదా పోలీసుచర్యకు యీ రెండే గోవావిముక్తికి మార్గాలని జనసంఘ కార్యదర్శి శ్రీ జగన్నాథరావు జోషి పత్రికా విలేఖరులతో చెప్పారు. పోలీసుచర్య స్వాతంత్ర్య సమరంలో భాగమేగాని దురాక్రమణ కాబోదని, గోవాను పాక్ ఆక్రమిత కాశ్మీరును కూడా మనలో చేర్చాలని తమ అభిప్రాయం తెలిపారు.

శ్రీ జోషికి పొదిలిలో రు 116 గూడూరులో రు 116 కావలిలో రు 200 విరాళాలు లభించాయి. పొదిలి పౌరులు గొప్పస్వాగతమిచ్చారు. అక్కడ సభలో శ్రీ జోషి ప్రసంగించారు. (స్వ. వి.)

## భీమవరంలో ధాన్యం, బియ్యం ధరలు

### ఇతర ప్రాంతాలకు బాగా ఎగుమతులు

భీమవరం, జూలై 8: భీమవరంలో ఈ వారాంతాన మేలిరకం ధాన్యం ధర కొంచెం పెరిగింది. కొచ్చిన్, కాలికట్‌లకు దాదాపు వెయ్యి టన్నుల ధాన్యం ఎగుమతి అయింది. కింపటివారంలో సౌరాష్ట్రకు కూడా 200 టన్నుల మేలిరకం బియ్యం ఎగుమతి అయినవి. నిన్నటి ధరల వివరాలివి!

| | |
|---|---|
| ధాన్యం: | 166 సౌన్ల బస్తా |
| అక్కుళ్లు | రు. 27 |
| సరికలు | రు. 25 |
| కృష్ణకాటుకలు | రు. 28 |
| సన్నకృష్ణకాటుకలు | రు. 29 |
| కిచిలీలు | రు. 29-50 |
| బంగారు తీగలు | రు. 30 |
| బియ్యం: | 164 సౌన్ల బస్తా |
| అక్కుళ్లు | రు. 42 |
| సరికలు | రు. 40-75 |
| కృష్ణకాటుకలు | రు. 43 |
| సన్నకృష్ణకాటుకలు | రు. 45 |
| కిచిలీలు | రు. 48 |
| బంగారు తీగలు | రు. 49 |
| వంకసన్నాల్లు | రు. 49 |

# ఆకాశవాణి

శుక్రవారం, జూలై 12

హైదరాబాద్

ఉ॥ 6-50 సుప్రభాత్ 7 తె. వా. 7-15 పుల్లెలపేరి సోమయాజులు (ఫిడేలు విజయవాడ రిలే) 7-45 క. వా. 8 ఆం. వా. 8-15 హిం. వా. 8-30 శైలజా బలేశ్వర్ కర్ 8-45 యం. సత్యనారాయణ

మ॥ 12-30 గీత్ మాధురి 12-50 వు. వా. స్త్రీసంసార్ 1-45 ఫిడేలు 1-50 తె. వా. 2 ఘుజల్ 2-10 ఉ. వా. విద్యార్థులకు 2-40 గీత్ 2-50 ప్రా. పా. విద్యార్థులకు.

సా॥ 3-45 పాఠశాలలకు (ఉర్దూ) 5-30 జీవన్‌కుమార్ (భజన్:గీత్)5-45 హిం. సం. పాఠం 6 ప్రకటనలు 6-15 గ్రామసీమ 7-30 మద్రాసునుంచి రిలే 9 ఆం. వా. 9-15 ఉ. వా. 9-30 వి. వసంత గీతావళి 9-50 గాంధీచర్చ 10 శైలజా మహాబలేశ్వర్ కర్ 10-30 సమాప్తి.

విజయవాడ

(357-1 మీటర్లు) (840 కిలో సై.)

ఉ॥ 6-30 శుభోదయం 6-40 భక్తి రంజని 7 తె. వా. 7-15 పుల్లెలపేరి సోమయాజులు (ఫిడేలు) 7-45 గాంధీ చర్చ 8 ఆం. వా. 8-15 హిం. వా.

మ॥ 12-30 మా. పా. విద్యార్థులకు 1 వాద్యసంగీతం 1-30 గీతమంజరి 1-40 హిం. వా. 1-50 తె. వా. 2 క్లారినెట్ 2-10 ఉ. పా. విద్యార్థులకు 2.40 క్లారినెట్ 2-50 ప్రా. పా. విద్యార్థులకు.

సా॥ 5-30 వల్లూరి విఠల్ రావు (వేణువు.) 6 ప్రకటనలు 6-15 గ్రా. కార్య. 7-30 సాత్తూరు ఎ. జి. సుబ్రహ్మణ్యం (మదరాసునుంచి రిలే) 9 ఆం. వా. 9-15 మంత్రోదకం (నాటిక.) 9-30 గీతమంజరి 10 పుల్లెలపేరి సోమయాజులు (ఫిడేలు) 10-30 సమాప్తి.

మద్రాస్ (ఎ)

ఉ॥ 6-50 స్వాగతం 7 వాద్య సమ్మేళనం 7-15 త. వా. 7-30 తిరుచి రిలే.

మ॥ 12-30 మా. పా. విద్యార్థులకు 1 మదర్ నిగస్సి 1.30 గీత మంజరి 1-40 హిం. వా. 1-50 గీతమాలిక 2 త. వా. 2-10 ఉ. పా. విద్యార్థులకు 2-40 ఫిడేలు 2-50 పా. పా. విద్యార్థులకు.

సా॥ 5 పాశ్చాత్య సంగీతం 5-30 మణక్కాల్ యస్. నటరాజ అయ్యరు 6 ప్రాంతీయ వార్తలు (తమిళం) 6-15 కాంతిమతి లక్ష్మణన్ వీణ 6-45 వి. వి. శారద, వి. వి. సీత 7-15 త. వా. 7-30 తిరుచి రిలే 9 జంత్ర సమ్మేళనం 9-15 తిరుచి రిలే 9-30 సుగం సంగీత్ 9-50 వాద్య సంగీతం 10-30 సమాప్తి.

మద్రాస్ (బి)

6-50 మద్రాసు ఏ వలె 7 తె. వా. 7-15 ఉదయగానం 7-30 మద్రాసు ఏ వలె 8 ఆం. వా.

మ॥ 12 కా. కార్య12-30మా. పా. విద్యార్థులకు 1 గీతమాలిక 1-30 ఆం. వా. 1-40 గానమంజరి 1-50 తె. వా. 2 గీతమంజరి 2-10 ఉ. పా. విద్యార్థులకు 2.40 క్లారినెట్ 2-50 ప్రా. పా విద్యార్థులకు.

సా॥ 5 మద్రాసు ఏ వలె 5-30 తిరుచిరిలే 5-45 వినోద సంగీతం 5-50 ప్రకటనలు 6 ఆం. వా. 6-15 గ్రా. కార్య 7 తె. వా. 7-15 గ్రా కార్య 7-30 మద్రాసు ఏ వలె 9 ఆం. వా. 9-15 ఆఫ్రికా వ్యవహారాలు (ప్రసంగం 9-30 మద్రాసు ఏ వలె 10-30 సమాప్తి.

# మదరాసు ధరలు

మదరాసు, జూలై 10:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు పవరను 1-క ఎడ్వర్డుబొమ్మ సేల్సుటాక్సులో సహా రు. 70.62

| | |
|---|---|
| పేట్లబంగారం తులం రు. | 107.12 |
| మూసా బంగారం తులం రు. | 105.25 |
| సీమవెండి తులం 100కి రెడి | 182.00 |
| చిల్లర ధర రు. | 1.87 |

వేరుశనగ

(551 సౌ॥ 1-క ఎక్సుకోస్ట్ గిడ్డంగులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా

| | |
|---|---|
| డిసెంబరు | రు. 165-170 |
| వేరుశనగనూనె ఎక్సుసెల్లర్ మిల్లో % సౌ.) రెడి చిల్లర ధర | 382 |

(ఎక్సుసెల్లర్‌కి రు. 26, సేల్సుటాక్సు, ఎక్సైజ్ సుంకంతో సహా)

50 కెంకాయనూనె (87½ సౌనులు సేల్సుటాక్సు అదనం,

| | |
|---|---|
| ఆంబుమార్కు | రు. 81.50 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | 82.00 |
| రాజా | రు. 31.50 |

ఆముదం

| | |
|---|---|
| తిరుపత్తూరు (500 సౌ.) రు. | 344.00 |

పంచదార

| | |
|---|---|
| నెలం లోటస్ క్యాన్ (87½ సౌ) | 28.04 |
| అనకాపల్లి (226 సౌ.) | 109.06 |
| సాముల్కోట | 108.60 |

## న్యూయార్కు దూది

### అక్టోబరు వాయిదా ధరలు

న్యూయార్కు, జూలై 9: న్యూయార్కు కాటన్ మార్కెట్ ధరలు నేడీ విధంగా ఉన్నవి:

| | |
|---|---|
| నేటి ప్రారంభ ధర | 34.80 |
| నేటి ముగింపు ధర | 34.88 |

## చీరాలలో పిచ్చి కుక్కల బెడద

### 50 మందికి కాట్లు

చీరాల, జూలై 7: ఈ వారంలో చీరాలలో యాభైమందిని పిచ్చికుక్కలు కరచినవని ప్రభుత్వ ఆసుపత్రిలో తెలిసింది. వీరందరికీ ఉచితంగా ప్రభుత్వ ఆసుపత్రిలో చికిత్స చేస్తున్నారు. పిచ్చికుక్క కరచిన వాళ్ళకు చికిత్స చేసేందుకు ఇదివరకు రూ 12-8-0 వసూలు చేసేవాళ్ళు. ఇప్పుడు అందరికీ ఉచితంగానే వైద్యం చేస్తున్నారు. పిచ్చికుక్కలను చంపించ వలసినదిగా పురపాలక సంఘానికి వైద్యశాఖాధికారి సలహా చెప్పారు.

## సంతె కూడ్లూరులో గ్రామ నాయక శిబిరం

ఆదోని, జూలై 8: పెద్ద తుంబళం జాతీయ విస్తరణ కేంద్రం యాజమాన్యాన సంతె కూడ్లూరు గ్రామంలో ఏర్పాటు చేసిన గ్రామనాయక శిక్షణ శిబిరానికి నిన్న శాసనసభ్యుడు శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి ప్రారంభోత్సవం జరిపారు.

పత్తికొండ జిల్లా కాంగ్రెసు కార్యదర్శి శ్రీ హెచ్. వెంకటేశ్వరరావు, సంయుక్త కార్యదర్శి శ్రీ ఎ. జి. లక్ష్మీనారాయణశెట్టి మొదలయినవారు హాజరయ్యారు.

ప్రార్థన గీత గానంతో కార్యక్రమం మొదలయింది. అభివృద్ధి శాఖోద్యోగి శ్రీ ఏకాంబరం సభికులకు స్వాగతం చెప్పారు. శ్రీ హెచ్. వెంకటేశ్వరరావు గ్రామనాయక శిక్షణ శిబిరాల ప్రాముఖ్యాన్ని వివరించారు. శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి తమ ప్రసంగంలో పంచవర్ష ప్రణాళికలను గూర్చి, జాతీయ విస్తరణ శాఖ కార్యక్రమాలను గూర్చి వివరించి, గ్రామాల అభివృద్ధికి ప్రజలు ధన ధాన్య వస్తువులను విరాళంగా ఇవ్వాలని విజ్ఞప్తి చేశారు.

జాతీయ విస్తరణ శాఖాధికారులు తాము నిర్వహిస్తున్న కార్యక్రమాలను సభికులకు వివరించారు.

## ఆంధ్ర ప్రదేశ్ హోమియోమండలి

హైదరాబాదు, జూలై 8: ఆంధ్ర తెలంగాణాలలోని హోమియో వైద్యుల రిజిస్ట్రేషన్ చట్టాన్ని సమన్వయం చేసిన తరువాత, యీ రెండు ప్రాంతాలకు ఉమ్మడిగా ఒకే హోమియో వైద్య మండలిని యేర్పాటుచేసే విషయం ప్రభుత్వం ఆలోచిస్తున్నదని, ముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఇవాళ శాసనసభలో చెప్పారు.

ఆంధ్ర ప్రాంతానికి 6 గురు సభ్యులతో ఒక హోమియో మండలిని ఏర్పాటు చేసినట్లు తెలియజేశారు. (ఈ విషయం నిన్నటి పత్రికలోనే ప్రచురించాము. సం.)

## బళ్ళారి క్షయ ఆస్పత్రికి అదనపు భవనం

బళ్ళారి: జూలై 8: విక్టోరియా క్షయ ఆస్పత్రి అదనపు భవనానికి నిన్న మైసూరురాష్ట్ర ఆరోగ్యమంత్రి శ్రీ ఆర్. ఎం. పాటిల్ ప్రారంభోత్సవం జరిపారు.

శ్రీ పాటిల్ తమ ఉపన్యాసంలో రాష్ట్రంలో తగినంతమంది వైద్యవిద్యా నిపుణులు లేరనీ, ఈ లోటును తీర్చటానికి హుబ్లీలో క్రొత్తగా ఒక వైద్య కళాశాలను నెలకొల్పటంతోపాటు బెంగుళూరు వైద్య కళాశాలను ప్రభుత్వం వశపరుచుకుంటోందని చెప్పారు. ఆస్పత్రులకు కావలసిన పరికరాలను సరఫరా చేసే విషయమై మాట్లాడుతూ విదేశీ ద్రవ్యమారకం చిక్కులవల్ల ప్రభుత్వం వాటిని సరఫరా చేయలేకపోతోందన్నారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికాకాలంలో కుటుంబ నియంత్రణ పథకాన్ని ప్రచారంలోకి తెచ్చే నిమిత్తం ప్రజలు వైద్యులతో సహకరించాలనీ, ఈ కాలంలో ప్రభుత్వం రాష్ట్రంలో ఐదు పరిశోధనా కేంద్రాలను నెలకొల్పుతుందనీ మంత్రి వివరించారు.

ప్రారంభోత్సవానికి పూర్వం పట్టణ వర్తకసంఘం పక్షాన శ్రీ జె. జంబన్న శ్రీ పాటిల్‌కు స్వాగతంచెప్పి పట్టణంలో ప్రసూతి కేంద్రాన్ని నెలకొల్పాలనీ, అందుకు పురపాలక సంఘం రూ. 50 వేలు, శ్రీ కుప్పుస్వామి మొదలియార్ మరొక రూ. 50 వేలు విరాళంగా ఇచ్చారనీ చెప్పారు. తరువాత ఆస్పత్రి సూపరింటెండెంట్ శ్రీ రాజశేఖర్ ఆస్పత్రి అవసరాలను మనవి చేశారు.

మంత్రి 6 వ తేదీన ఇక్కడకు వచ్చారు. అతిథిభవనంవద్ద ఆయనకు డిప్యూటీకమీషనర్ శ్రీ టి. వి. రెడ్డి, శాసనసభ్యులు శ్రీయుతులు రామయ్య, శాయన్‌గౌడ్ స్వాగతం చెప్పారు.

శ్రీ పాటిల్ నిన్న ఉదయం ప్రభుత్వ ఆస్పత్రినీ, స్త్రీల ఆస్పత్రినీ సందర్శించారు. ఆయన వెంట జిల్లా వైద్యశాఖాధికారి ఉన్నారు. (స్వ. వి.)

## యలమంచిలి రైల్వే స్టేషన్‌కు విద్యుద్దీపాలు

మద్రాసు, జూలై 9: ఎమినెంట్ రైల్వేలోని బయ్యవరం, యలమంచిలి స్టేషనుల మధ్య నరసింగపల్లివద్ద హాల్టు స్టేషను ఏర్పాటు చేయటానికీ, ఉలవపాడు, సింగరాయకొండమధ్య రైల్వే ఆగే ఏర్పాటుచెయ్యటానికి దక్షిణ రైల్వే జనరలు మేనేజరు అంగీకరించారు.

మంచెల రైల్వే వినియోగదార్ల సలహా సంఘం ఈ నెల 5, 6 తేదీలలో పూనాలో సమావేశమై రైల్వేలో చేయవలసిన అనేక సౌకర్యాలు గూర్చి చర్చించారు.

యలమంచిలి రైల్వే స్టేషన్‌కు విద్యుచ్ఛక్తి దీపాలు బీమవరం గుమ్మ షెడ్ విస్తరణగాయి ఏర్పాటుగూర్చి కూడా చర్చించారు. ఈ సౌకర్యాలు కలుగచేయటానికి రైల్వే జనరలు మేనేజరు అంగీకరించారు.

అహమదాబాదు జిల్లా 'లోథాల్' గ్రామంలో ఈమధ్య జరిపిన త్రవ్వకాల ఫలితంగా, 'హరప్ప-మొహంజోదారో'లవద్ద లభించినటువంటి చారిత్రిక అవశేషాలు లభించాయి. ఆనాటి ఇళ్లు ఎలా నిర్మించారో, ఎలా కాలవలు మొదలైన పారిశుధ్యపు సౌకర్యాలు ఏర్పాటు చేసుకున్నారో చూడవచ్చు.

పుత్తూరువద్ద వనమహోత్సవం, జిల్లా పంచాయతీ ఉద్యోగి శ్రీ డి. సుబ్బారెడ్డి జరిపారు.

'లోథాల్' త్రవ్వకాలలో దొరికిన ఒక 'ఎద్దు, ఆనాటి లిపి' గల ఒక చలువరాయి. ఇలాటి లిపిఉన్న ముద్రికలు (రాతివి, మట్టివి) 75 దొరికాయి.

## భీమవరంలో దోమల బెడద

### పారిశుద్ధ్యశాఖ ఉద్యోగి లేడు

భీమవరం, జూలై 8: మలేరియా నిరోధకశాఖ ఉద్యోగిని భీమవరం పురపాలక 3 వ పారిశుద్ధ్యశాఖ ఇన్‌స్పెక్టరుగా నియమించినందున మలేరియా నిరోధకశాఖ సరిగ్గా పని చేయలేకపోయింది. పట్టణంలో దోమలబాధ చాలా ఎక్కువైంది. పైగా విపరీతంగా వానలు కురుస్తున్నందున మురికినీటి కాలవలలోనూ, గుంటలలోనూ, నీళ్లు నిలిచి దోమలకు ఆలవాలమైనవి.

మలేరియా నిరోధకపథకాన్ని 1958 మార్చి 31 దాకా కొనసాగించాలని పురపాలక సంఘం ఇదివరకే తీర్మానించి అందుకు డబ్బును మంజూరు చేసింది.

దోమలకు తోడు భీమవరంలో శీతజ్వరం ఎక్కువైంది. కిందటి నెలా పదిహేను రోజులుగా పురపాలక సంఘానికి ఆరోగ్యశాఖాధికారి లేడు. కమీషనరే ఆపనికూడా చూస్తున్నారు. మలేరియా నిరోధకపథకానికి ప్రత్యేకంగా పారిశుద్ధ్యశాఖ ఉద్యోగిని వెంటనే నియమించడం అత్యవసరం.

## ఆత్మకూరువద్ద సారానేరాలు

### 26 మంది నిర్బంధం

ఆత్మకూరు, జూలై 7: పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్లు శ్రీయుతులు వి. కోటయ్య, షేక్ మహబూబ్ షరీఫ్ ఇటీవల తమ సిబ్బంది సహాయంతో పరిసర గ్రామాలైన నందిపుంట, కొత్తపల్లె, గువ్వల కుంట్లమీద దాడి జరిపి 10 గాలన్ల సారా, 500 గాలన్ల ఊట వశపరచుకున్నారు. ఈసంవత్సరంలో 26 మందిని నిర్బంధించి, నేరారోపణ చేశారు.

పై ఉద్యోగులే 6818 ఈ వారంలో నంది కుంట గ్రామంమీద దాడిచేసి 400 గాలన్ల ఊట, 2 బస్తాల బెల్లం వశపరచుకున్నారు. ఏనుగురు వ్యక్తులపై నేరారోపణ జరిగింది. కానీ వీరంతా ప్రస్తుతం పరారీలో ఉన్నారు. (స్వ. వి.)

## వెంగముక్క పాలెంలో సారా నేరాలు

ఒంగోలు, జూలై 7: పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ శ్రీ పి. సాంబమూర్తి ఇటీవల వెంగముక్కపాలెం గ్రామంమీద దాడిజరిపి, నాలుగు గాలన్ల సారా స్వాధీనపరుచుకుని నలుగురు వ్యక్తులను నిర్బంధించారు.

నేరస్థులు మోటారు ట్యూబులలోను, పెట్రోలు డబ్బాలలోను ఒంగోలుకు దొంగతనంగా సారా చేరవేస్తున్నారు. (స్వ. వి.)

## ఎన్. జి. ఓ. ల దుస్థితి వారం

### విజయవాడలో

విజయవాడ, జూలై 9: వివిధ ప్రభుత్వ కార్యాలయాలలో పనిచేస్తున్న సుమారు 2500 మంది నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు రాష్ట్ర ఎన్. జి. ఓల సంఘం ఆదేశానుసారం "దుస్థితి వారాన్ని" అమలు జరుపుతున్నారు. వీరంతా పతకాలు ధరించి మామూలు ప్రకారం కార్యాలయాలకు వెళ్ళి వస్తున్నారు.

నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు తమ కోరికలను ప్రభుత్వ దృష్టికి, ప్రజల దృష్టికి తెచ్చే నిమిత్తం రాష్ట్రవ్యాప్తంగా పై కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నారు.

రాష్ట్ర ప్రభుత్వం కూడా ఉద్యోగులకు కేంద్ర ప్రభుత్వం ఇస్తున్న ప్రకారం కరువు భత్యాలివ్వాలనీ, జీతాలను ప్రస్తుత పరిస్థితులనుబట్టి పెంచేందుకు ఒక సంఘాన్ని నియమించాలనీ, హైదరాబాదు నగరంలో పనిచేసే ఉద్యోగులకు రు 30 చొప్పున ప్రత్యేకభత్యం ఇవ్వాలనీ, మిగతా చోట్ల పనిచేసేవారికికూడా ఆయా చోట్ల గల జనాభానుబట్టి భత్యాలివ్వాలనీ ఉద్యోగుల సంఘం కోరింది.

### నరసాపురంలో

నరసాపురం, జూలై 7: తాలూకాలో సుమారు 200 మంది నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు రాష్ట్ర ఎన్. జి. ఓల సంఘం ఆదేశానుసారం "దుస్థితి వారాన్ని" పాటిస్తున్నారు. వీరంతా పతకాలు పెట్టుకుని కార్యాలయాలకు వెళుతున్నారు.

నిన్న సాయంత్రం ఉద్యోగులంతా పదనిమషాలపాటు దైవప్రార్థన చేశారు. (స్వ. వి.)

### రాజమండ్రిలో

రాజమండ్రి, జూలై 7: రాష్ట్ర సంఘం ఆదేశం ప్రకారం రాజమండ్రిలో 500 మంది నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు "ఎన్. జి. వో ల దుస్థితి" అనే మాటలున్న 'బాడ్జీలతో' వారి వారి కార్యాలయాలకు నిన్న వెళ్లారు. సంఘ కార్యాలయంలో సమావేశమై తమ దుస్థితిని ప్రభుత్వం గుర్తించేటట్టు చేయవలసినదిగా భగవత్ ప్రార్థనలు చేశారు.

### ఒంగోలులో

ఒంగోలులో నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు ఈ నెల 6 వ తేదీనుంచి "బాధల వారం" ప్రారంభించారు. "ఎన్. జి. ఓ. దుస్థితిలో ఉన్నారు." అనే మాట ఉన్న బాడ్జీలతో కార్యాలయాలకు హాజరవుతున్నారు. 6 వ తేదీ సాయంకాలం తహసీల్దారు శ్రీ పి. రఘురామయ్య అధ్యక్షతన సమావేశమై భగవత్ప్రార్థనలు జరిపారు.

### తణుకులో

తణుకు, జూలై 8: ఆంధ్రప్రదేశ్ ఎన్. జి. ఓ. ల సంఘం ఆదేశానుసారం తాలూకాలోని నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు "దుస్థితివారం" అమలు జరుపుతున్నారు.

వీరంతా ప్రత్యేక పతకాలు ధరించి తాలూకాసంఘం అధ్యక్షుడు శ్రీ వి. వెంకయ్యనాయుడు అధ్యక్షతను సమావేశమయ్యారు. శ్రీ జి. గోపాలం ప్రార్థన పద్యాలు గానంచేసిన తరువాత శ్రీయుతులు జె. కె. శాస్త్రి, డి. వి. సిద్ధాంతి, ఎస్. వ్యాఘ్రాచారి, టి. రామచంద్రరావు మొదలైనవారు రాష్ట్ర ప్రభుత్వంకూడా ఉద్యోగులకు కేంద్రప్రభుత్వం ఇస్తున్న ప్రకారం భత్యాలివ్వాలని కోరారు.

శ్రీ కె. వెంకట్రావు వందనసమర్పణం చేశారు. (స్వ. వి.)

## రేపల్లెలో అగ్నిప్రమాదం

### 35 పూరిండ్లు దగ్ధం

రేపల్లె, జూలై 8: గొల్లపాలెంలో 6 వ తేదీ సాయంత్రం అగ్నిప్రమాదం సంభవించి 35 పూరిండ్లుదగ్ధమయ్యాయి. సుమారు రు 10 వేలు ఆస్తి నష్టమైంది.

మంటలు ఆర్పటానికి తెనాలినుంచి అగ్నిప్రమాద నివారణదళం వచ్చేలోగానే పురజనులు పరిస్థితిని అదుపులోకి తెచ్చారు. (స్వ. వి.)

### ములుమూడి హరిజనవాడలో

నెల్లూరు, జూలై 7: నెల్లూరు ములుమూడి హరిజన వాడలో నిన్నరాత్రి జరిగిన అగ్నిప్రమాదంలో దాదాపు రు 20 వేల నష్టం సంభవించింది. 70 ఇళ్లూ, 20 గడ్డివాములూ, వడ్లూ పరశురాము ప్రీతి అయినవి. నెల్లూరునుంచి అగ్నిప్రమాద నివారణ యంత్రాలు వచ్చి మంటలను ఆర్పినవి.

### విశాఖపట్టణంలో

### 50 ఇండ్లు దగ్ధం

విశాఖపట్టణం, జూలై 6: వెలమపేటలో ఈ రోజు ఉదయం అగ్నిప్రమాదం సంభవించి 50 ఇండ్లు దగ్ధమైపోయాయి. సుమారు 250 మంది నిరాశ్రయులయ్యారు.

పట్టణ ప్రేమసమాజంవారు మంటలు చల్లార్చటంలో సహాయపడటమేకాక బాధితులకు "శ్రీ జి. ఎస్. నాయుడు సోదరుల" విరాళంతో భోజనసదుపాయం కలిగించారు.

## గ్రామాధికారుల కోరికలు

### సానుభూతికోసం విజ్ఞప్తి

బందరు, జూలై 8: గ్రామాధికారుల కోరికలను సానుభూతితో పరిశీలించవలసినదిగా ప్రభుత్వానికి బందరు తాలూకా గ్రామాధికారులసభ విజ్ఞప్తి చేసింది. శ్రీ చిట్టా బాలకృష్ణశాస్త్రి అధ్యక్షత వహించారు. సభను ఆంధ్ర రాష్ట్ర గ్రామోద్యోగుల సంఘం సహాయ కార్యదర్శి శ్రీ కొపకరపు వెంకటకృష్ణమూర్తి ప్రారంభించారు. శ్రీయుతులు కొడాలి ఆంజనేయులు, రాళ్లపల్లి అచ్యుతరామయ్య, పోతరాజు శోభనాచలపతిరావు, బి. కుమారస్వామిగారలు ప్రసంగించారు.

గ్రామాధికారులను శిక్షించవలసినదిగా ఇటీవల ఇచ్చిన ఉత్తరువును రద్దు చేయకండ్వారా సానురస్య వాతావరణం కల్పించవలసినదిగా ప్రభుత్వానికి విజ్ఞప్తిచేసింది.

### నంద్యాల తాలూకా జమాబందీ

ఆళ్లగడ్డ, జూలై 9: నంద్యాల తాలూకా జమాబంది ఈ నెల 3 వ తేదీనుంచి జరుగుతోంది. గ్రామోద్యోగుల సహకారమైఖరికి నంద్యాల సబ్‌కలెక్టరు సంతోషం ప్రకటించారు.

## తణుకులో శీతజ్వరం

### నాలుగువేల మందికి

తణుకు, జూలై 8: తణుకులో శీతజ్వరం ఇంకా తగ్గలేదు. దాదాపు ప్రతి ఇంట్లోనూ ఈ వ్యాధి కనిపిస్తోంది. ఇక్కడ నాలుగువేలమందికి ఈ వ్యాధి వచ్చిందట. జిల్లాఅంతటా శీతజ్వరం ఉన్నట్టు జిల్లా కలెక్టరు ప్రకటించగా, తమవద్ద ఈ రోగు లెవరూ చికిత్సపొందటం లేదనుకుని తణుకులో శీతజ్వరం అంత ఎక్కువగాలేదని ప్రభుత్వ డాక్టరు చెప్పినట్లు తెలుస్తోంది.

### రేపల్లెలో శీతజ్వరం

రేపల్లె, జూలై 8: రైలుపేటలో నిన్న ఒక స్త్రీ శీతజ్వరంవల్ల మరణించింది. వ్యాధి పట్టణంలో ఇంకా తీవ్రంగానే వ్యాపించిఉన్నది. (స్వ. వి.)

## తాడేపల్లిగూడెం "పురపాలకసంఘం"

### ఏర్పాటుచేయవలసిందిగా విజ్ఞప్తి

తాడేపల్లిగూడెం, జూలై 8: తాడేపల్లిగూడెం పట్టణానికి పురపాలక సంఘాన్ని ఏర్పాటు చేయవలసినదిగా ప్రభుత్వానికి పట్టణ ప్రజాపార్టీ కార్యవర్గం మొన్న విజ్ఞప్తి చేసింది.

సమావేశానికి శ్రీ కె. వి. సాంబశివరావు అధ్యక్షత వహించారు.

తాడేపల్లిగూడెం జనాభా 25 వేలు. సాలుసరి ఆదాయం రు 1 లక్ష. పురపాలక సంఘాన్ని ఏర్పాటు చేస్తే వైద్య సౌకర్యాలూ, మంచినీటి సప్లయి, ఇంకా ఇతర సౌకర్యాలు ఏర్పడుతవనే దృష్టితో మొదట్లో విధించే అదనపు పన్నులను చెల్లించేందుకుకూడా ప్రజలు సిద్ధమేనని తీర్మానంలో వివరించారు.

## తుంగబద్ర గ్రామంలో పాఠశాలా భవనం

ఆదోని, జూలై 8: తుంగబద్ర గ్రామంలో నూతనంగా ఏర్పాటు చేసిన ప్రాథమిక పాఠశాలకు 6 వ తేదీన శాసనసభ్యుడు శ్రీ టి. జి. తిమ్మయ్య ప్రారంభోత్సవం జరిపారు.

పాఠశాలను నెలకొల్పుకోవటానికి గ్రామస్థులు చూపిన శ్రద్ధను, భవనాన్ని విరాళంగా ఇచ్చిన శ్రీ రామయ్య దాతృత్వాన్నీ శ్రీ తిమ్మయ్య ప్రశంసించారు. జిల్లా కాంగ్రెసు కార్యదర్శి శ్రీ హెచ్. వెంకటేశ్వరరావు ప్రాథమిక విద్య ప్రాముఖ్యాన్ని తెల్పారు.

## యన్.జి.రంగా కంచువిగ్రహ ఆవిష్కరణ

విజయవాడ, జూలై 8: శ్రీ యన్. జి. రంగా కంచువిగ్రహాన్ని యీ నెల 12 ఉదయం ఇక్కడ కేంద్రమంత్రి శ్రీ యస్. కె. పాటిల్ ఆవిష్కరిస్తారు. డాక్టర్ యం. డిమిట్రావ్ అధ్యక్షత వహిస్తారు. ఉదయం వూరేగింపు జరుగుతుంది. మధ్యాహ్నం ఆంధ్రదేశ రైతు కార్యకర్తలు స్వాగత సభ ఏర్పాటు చేస్తారు.

## నిర్మాణ కార్యకర్తల సభ

ఆనందాశ్రమం, జూలై 7: ఆంధ్రప్రదేశ్ నిర్మాణ కార్యకర్తల సభ కృష్ణాజిల్లా పెనమలూరులో ఈ నెల 13 వ తేదీన జరుగుతుంది. శ్రీ సానె నారాయణరావు అధ్యక్షత వహిస్తారు. సభను గాంధీ స్మారక నిధి కార్యదర్శి శ్రీ ఆర్. ఎస్. ధోత్రే ప్రారంభిస్తారు.

## పథకాల అమలులో ఇబ్బందులు తప్పవు

### ఐక్యకృషి కార్యదీక్ష అవసరమని విజ్ఞప్తి

కడప, జూలై 6: కోడూరులో గత నెల 30 తేదీన బ్లాక్ అధికారుల గోష్ఠిని ప్రారంభిస్తూ అభివృద్ధి పనులకు సంబంధించిన పథకాల అమలులో అనేక ఇబ్బందులు, లోపాలు, తప్పవని, అయినా పట్టుదల, ఉత్సాహం, ఐక్యకృషి, ద్వారా విజయవంతంగా పనులు అమలుజరుపవచ్చని జిల్లాకలెక్టరు జనాబ్ సయద్ మహమద్ చెప్పారు.

అభివృద్ధి కేంద్రాల అధికార అనధికార ప్రముఖులు యీ సమావేశానికి వచ్చారు. ఆయా ప్రాంతాల సమస్యలు చర్చించారు.

కలెక్టరు ప్రసంగిస్తూ ఎవ్వరూ కూడా తమకు ఏదో గొప్ప హోదా, అధికారం, పలుకుబడి కలవని పౌరబుద్ధిరాదని నవభారత నిర్మాణంలో అందరు భాగస్వాములేనని గ్రహించాలని కోరారు. ఇటువంటి గోష్ఠి సమావేశాలు ఏర్పాటు చేయడంవలన సిబ్బందికీ, ప్రజలకు, మధ్య మరింత సన్నిహిత సంబంధాలు ఏర్పడగలవని సూచించారు.

శ్రీ పి. పార్థసారథి మాట్లాడుతూ ప్రభుత్వశాఖల మధ్య మరింత సహకారం వుంటేపథకాలు బాగా అమలు జరగ గలవన్నారు.

స్వామి శ్రీ విశ్వానంద భరోస్వదయ లక్ష్యం ప్రస్తావించారు. చర్చలను శ్రీ సి. రంగనాథం ప్రారంభిస్తూ జీవంపదిన సమస్యలలో సాధక బాధకాలను తెలుపమని అందరినీ కోరారు.

వినోదప్రదర్శనల తరువాత శ్రీ బి. రంగారావు వందనమర్పించారు.

## కడప జిల్లాలో నదులపై వంతెనలు

### ప్రణాళికా సంఘం సిఫారసు

కడప, జూలై 6: పాపాఘ్ని, చెయ్యేరు, సగిలేరు, చిత్రావతి, నదులపై వంతెనలు నిర్మించవలసిందిగా ప్రభుత్వానికి జిల్లా ప్రణాళికాసంఘం సిఫార్సు చేసింది.

సంఘ సమావేశానికి కలెక్టరు జనాబ్ సయద్ మహమద్ అధ్యక్షత వహించారు. ఇంతవరకు జరిగిన పనులను సమీక్షించారు.

పోరుమామిళ్ళ, పులివెందుల చెన్నూరు బ్లాక్‌లు ప్రభుత్వమెప్పును పొందినందుకు కలెక్టరు అభినందించారు. బ్లాక్ ప్రాంతాలు పర్యటించి సలహాలివ్వాలని శాసనసభ్యులకు శ్రీయం. రాంసింగ్ (జిల్లా ప్రణాళికాధికారి) విజ్ఞప్తి చేశారు.

ప్రజాసహకారం ఎక్కువగాసాధించడానికి బ్లాక్ అభివృద్ధి పుద్యోగులు తరుచు తమప్రాంతాలు పర్యటిస్తూ వుండాలని కోరుతూ ఒకతీర్మానం ఆమోదించారు. (స్వ. వి.)

## గ్రామ నాయకుల శిక్షణ శిబిరం

తిరుత్తని, జూలై 6: అరుంగోణం-పల్లిపట్టు సమాజాభివృద్ధి కేంద్రం ఆధ్వర్యాన తిరుత్తని తాలూకా ఏరుమల్లిరాజుపేటలో గ్రామనాయకుల శిక్షణ శిబిరం ఈ నెల 12 నుంచి 15 వ తేదీ దాకా జరుగుతుంది.

అమెరికా సాంకేతిక సహకారసంస్థ తరఫున భారతదేశంలో యంత్రి సామగ్రి ఫ్యాక్టరీల అభివృద్ధికి తగు సూచన లివ్వడానికి తిరుగుతున్న సాంకేతికుల బృందం గత వారం మద్రాసులోని అడిసన్స్ యంత్రి పరికరాల ఫ్యాక్టరీని సందర్శించారు.

## 'శాసనసభ ఐక్యకాంగ్రెస్' అన్నే పేరుకు ఇక స్వస్తి

### కాంగ్రెసు ప్రమాణ పత్రంపై చేవ్రాలు పెట్టేవారికి సభ్యత్వం

హైదరాబాదు, జూలై 9: కాంగ్రెసు అభ్యర్థులుగా ఎన్నిక గాకపోయినా, కాంగ్రెసు విధానాన్ని, కార్యక్రమాన్ని అంగీకరించి, ప్రమాణపత్రంపై సంతకంపెట్టే వారిని, సభ్యులుగా చేర్చుకోడానికి, ఆంధ్రప్రదేశ్ శాసనసభ కాంగ్రెస్‌పార్టీ ఏకగ్రీవంగా తీర్మానించింది. అయితే యీ తీర్మానానికి పార్టీ అంగీకరించవలసి ఉంటుంది.

శాసనసభ కాంగ్రెసు పార్టీ యీ తీర్మానంవల్ల, వేమనలిస్టుపార్టీ సభ్యులు 20 మంది కాంగ్రెసు పార్టీలో చేరడానికి వీలేర్పడుతుంది. ఇంతవరకు శాసనసభలోని కాంగ్రెసు పార్టీని ఐక్యకాంగ్రెసు పార్టీ అని వ్యవహరిస్తున్నారు. ఇక ఆ పేరుమార్చి, ఆంధ్రప్రదేశ్ శాసనసభ కాంగ్రెసుపార్టీ అని వ్యవహరించడానికి కూడా నిశ్చయించారు.

శాసనసభ కాంగ్రెసుపార్టీ, నియమావళి సవరణకోసం యీ సాయంత్రం నాయకుడు శ్రీ సంజీవరెడ్డి అధ్యక్షతన సమావేశమైంది. కొత్త నియమావళి ముసాయిదాను ఏకగ్రీవంగా ఆమోదించారు. పార్టీలో సభ్యుల సంఖ్య ఇప్పుడు 214.

కొత్త నియమావళి ప్రకారం, జాతీయ కాంగ్రెసులో సభ్యత్వంపొందనివారు, లేదా, కాంగ్రెసునుండి బహిష్కృతులైన వారు, శాసనసభలోని తమ సభ్యత్వంకు రాజీనామా ఇవ్వాలి; కాంగ్రెసు శాసనసభ పార్టీలో సభ్యత్వానికి తనకు తానుగా రాజీనామా ఇచ్చిన వ్యక్తి, శాసనసభలోని తన స్థానానికి కూడా రాజీనామా ఇవ్వాలి.

భారత జాతీయ కాంగ్రెసు సూచించిన పద్ధతిలోనే, యీ నియమావళి తయారుచేశారు. శాసనసభ కాంగ్రెస్ పార్టీకి నాయకుడైన వ్యక్తి ఇక శాసనసభ గడువు తీరేదాకా నాయకుడుగా ఉంటారు. ఈలోగా మళ్లీ నాయకత్వానికి ఎన్నిక అంటూ ఉండదు.

"కాంగ్రెసుపార్టీ, శాసనసభలో ప్రతిపక్షంగా ఉన్నప్పుడు, ఏ సభ్యుడూ ప్రభుత్వంలో జీతంపైగాని, జీతం లేకుండాగాని, లేదా మరో రూపంలో ప్రతిఫలం పుచ్చుకొనిగాని ఏ పదవీ స్వీకరించకూడదని, ప్రభుత్వం నియమించే ఏ సంఘంలోనూ సభ్యుడుగా చేరకూడదనీ, యిలా చేరదలచుకుంటే ముందుగా పార్టీ నాయకుని అనుమతి, లేదా కార్యవర్గం అనుమతి పొందాలని, యీ కొత్త నియమావళిలో ఉన్నది.

### ఐక్య కాంగ్రెసు రద్దు

1955లో ఆంధ్రరాష్ట్ర శాసనసభకు ఎన్నికలు జరిగినప్పుడు, శాసన సభలో యీ ఐక్య కాంగ్రెసుపార్టీ ఏర్పడింది. ఇందులో కాంగ్రెసు, కృషికార్ లోక్, ప్రజాపార్టీలున్నాయి. ఎన్నికలు అయిన తరువాత కృషికార్ లోక్ పార్టీ కాంగ్రెసులో లీనమైపోయింది. కాని ప్రజాపార్టీకి చెందిన 8 మంది, ఐక్య కాంగ్రెసులో వేరే పార్టీగా అంటూ వచ్చారు. ఇప్పుడీ 'ఐక్య కాంగ్రెసు' అనే పేరు రద్దుచేసి, ఆంధ్రప్రదేశ్ శాసనసభ కాంగ్రెసుపార్టీ అని వ్యవహరించడానికి యివాళటి పార్టీ సమావేశంలో తీర్మానించారు.

పార్టీ ప్రతినిధి ఒకరు పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ, ఆంధ్రప్రాంతంనుంచి, శాసన సభకు ఎన్నికైన ప్రజాపార్టీ సభ్యులు, ఆంధ్రప్రదేశ్ శాసనసభ కాంగ్రెసుపార్టీలో సభ్యులుగా ఉంటూ ఉంటారని, ఇటీవల తెలంగాణానుంచి శాసన సభకు ప్రజాపార్టీ అభ్యర్థులుగా ఎన్నికైనవారు మాత్రం వేరే పార్టీగానే ఉంటారని చెప్పారు.

### ప్రజా పార్టీ అధ్యక్షుని అధిక్షేపణ

ప్రజా పార్టీ అధ్యక్షుడు బత్తెనరాజు కృష్ణారెడ్డి, పార్టీ నియమావళి మార్చి 'ఐక్యకాంగ్రెసు' అనే పేరు రద్దుచేస్తున్నందుకు అధిక్షేపణ తెలిపారు.

ఆయన శ్రీ నీలం సంజీవరెడ్డికి ఉత్తరం వ్రాస్తూ, "ప్రస్తుతం శాసనసభా కాంగ్రెసు పార్టీలో ఉన్న ప్రజాపార్టీ సభ్యులను తొలగించడానికే యీపని చేస్తున్నారని స్పష్టమౌతోంది అని పార్టీ పేరు మార్చడం, పూర్వం ప్రజాపార్టీ, కాంగ్రెసు పార్టీ కుదుర్చుకున్న ఒప్పందాన్ని ఉల్లంఘించడమేనని" అన్నారు.

కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ధేబర్‌కు ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూకు, యీ సంగతి తెలియపరుస్తున్నానని కూడా రామకృష్ణారెడ్డి వ్రాశారు.

ఇవాళటి పార్టీ సమావేశానికి ప్రజాపార్టీ సభ్యులు 8 మంది హాజరుకాలేదు.

## గంటల పంచాంగం

శ్రీ హేమలంబ సం॥ ఆషాఢ శు॥ పూర్ణిమ 1957 సం॥ జూలై 11 గురువారం శు॥ పూర్ణిమ రా 4-20 పూషా రా 5-31 వర్జ్యం 14-2 ల 15-45 వ.
బ॥ ప్రథమ జూలై 12 శుక్రవారం శు॥ ప్రథమ పూర్తి ఉషా పూర్తి వర్జ్యం 14-14 ల 15-58 వ.



ఆంధ్రపత్రిక

ఒకళే యతి యొనరించిన
వరవర ఘప్రియము వర పనంబున రగు దా
బౌదుంచు నవిపేయుచుని
వరాయణము వరుధర్మ వరమూంకెల్లవ్
(మహాభారతము)

హేమలంబ సం॥ ఆషాఢ శు॥ పూర్ణిమ
గురువారం

# జిల్లా బోర్డులు

జిల్లాబోర్డులను పునరుద్ధరించాలా లేదా అన్న విషయం రెండుమూడు సంవత్సరాలుగా ప్రభుత్వాలోచనలో వున్నది. ఇప్పటికి అయిదు సంవత్సరాలుగా జిల్లాబోర్డులు ప్రత్యేకోద్యోగుల క్రింద వుంటున్నవి. వీరి పదవీకాలాన్ని ప్రతి సంవత్సరమూ పొడిగిస్తూ వున్నారు. మరో నాలుగు మాసాల్లో ప్రత్యేకోద్యోగుల పదవీకాలం తీరిపోతుంది. ఎన్నికలు జరిపి జిల్లాబోర్డులను తిరిగి ఏర్పాటు చేయడమో లేక ఈ ఉద్యోగుల కాలాన్ని మరో సంవత్సరం పెంచడమో వెంటనే నిర్ణయంకావలసి వున్నది. ఉద్యోగుల పదవీకాలాన్ని రాష్ట్ర శాసనసభ పెంచవలసి వుంటున్నది. ప్రతిసంవత్సరమూ ఈ ప్రతిపాదన రాష్ట్ర శాసనసభ విచారణకు వచ్చినప్పుడు సభ్యులు జిల్లాబోర్డుల అవసరానవసరములను గురించి వారి అభిప్రాయాలను వెల్లడిస్తూనే వున్నారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డానికి పూర్వం ఆంధ్రరాష్ట్ర శాసనసభ కాంగ్రెస్ పక్షము జిల్లాబోర్డు ఎన్నికల పద్ధతిని కూలంకషంగా చర్చించినది. అయిదు సంవత్సరాలక్రితం జిల్లాబోర్డులకు ఎన్నికలు జరపడాన్ని రాష్ట్రప్రభుత్వం ఆపివేసింది. జిల్లాబోర్డులను రద్దుచేసివేసి తాలూకాబోర్డులను పునరుద్ధరించడం ప్రయోజనకరమని కొందరు సూచించారు. జిల్లాబోర్డులనే పునరుద్ధరించాలని, సభ్యుల ఎన్నిక వెనుకటిలాగా గాక పరోక్షపద్ధతిని ఎన్నికలు జరగాలని మరికొందరు సూచించారు. మొన్న సోమవారంజరిగినఆంధ్రప్రదేశ్ శాసనసభ కాంగ్రెసు పక్ష సమావేశంలో చాలామంది సభ్యులు జిల్లాబోర్డులు అవసరం లేదనే అభిప్రాయాన్ని వెల్లడించినట్లు తెలుస్తున్నది.

ఈ విషయమై మొన్నటి సమావేశంలో నిర్ణయం జరుగలేదు. ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం అధ్యక్షుడు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు మాత్రం జిల్లాబోర్డులు వుండితీరాలనే అభిప్రాయాన్ని వెల్లడించారు. సభ్యులలో అధిక సంఖ్యాకులు జిల్లాబోర్డుల పునరుద్ధరణకు విముఖంగా వున్నట్లు కన్పించిన కారణంగా, సభ్యులు "సరి అయిన అభిప్రాయానికి" వచ్చేందుకు పార్టీనాయకుడు శ్రీ సంజీవరెడ్డిగారు రెండువారాలు వ్యవధి ఇచ్చారు. ఈ వ్యవధి తీరిన తర్వాత కాంగ్రెసుపక్షం తిరిగి సమావేశమైనప్పుడు జిల్లాబోర్డులను పునరుద్ధరించాలనే సభ్యులు తీర్మానించవచ్చును. ఈ ఎన్నికలకు లక్షలరూపాయలు ఖర్చు అవుతుందని ఖర్చులను తగ్గించివేయవలసిన సమయంలో జిల్లాబోర్డులను పునరుద్ధరించడం వాంఛనీయం గాదని పలువురు సభ్యులు చేసిన వాదన సమంజసంగానే వున్నది. జిల్లాబోర్డుల పరిపాలనగాని, ఆర్థిక స్థితిగాని ఏమాత్రమూ తృప్తికరంగా లేదు. ఆదాయాన్ని మించిన ఖర్చులయినవి. సిబ్బందికి సకాలంలో జీతాలు ఇవ్వడంకూడా సాధ్యం కాలేదు. వీటన్నింటివల్లనే మామూలుగా జరుగవలసిన ఎన్నికలను ఆపివేసి ప్రత్యేకోద్యోగులను ప్రభుత్వం నియమించింది.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డానికి పూర్వమే జిల్లాబోర్డులు ప్రత్యేకాధికారుల క్రిందికి వచ్చినవి. మద్రాసు రాష్ట్ర విభజన జరిగిన తరువాత ఆంధ్రరాష్ట్రంలో గాని, మద్రాసు రాష్ట్రంలో గాని ఇంతవరకూ జిల్లాబోర్డులకు ఎన్నికలు జరుగలేదు. మద్రాసు రాష్ట్రంలో జిల్లాబోర్డులకు తిరిగి ఎన్నికలు జరుగనున్నవి. ఆంధ్రరాష్ట్రంలో కూడా ఎన్నికలు జరిపి జిల్లాబోర్డులను పునరుద్ధరించాలని ప్రభుత్వం భావించడం సహజమే. జిల్లా బోర్డులు అనవసరము, నిరుపయోగము అనే వాదన సహేతుకమైనది కాదు. అయితే సోమవారం జరిగిన సమావేశంలో కొందరు సభ్యులు సూచించినట్లు జిల్లాబోర్డుల నిర్మాణ పద్ధతిని కొంత సంస్కరించి, ఎక్కువ అధికారాలను ఇవ్వడం అవసరం. జిల్లాబోర్డులకు ఎన్నికలు జరిపే ముందు ప్రభుత్వం ఈ విషయాన్ని శ్రద్ధగా పరిశీలించి ఒక నిర్ణయానికి రావడం అవసరం.

## ఆసియా ఆఫ్రికా దేశాల రెండవ సమావేశం
### తేదీ నిర్ణయం కాలేదని నెహ్రూ ప్రకటన

హేగ్, జూలై 10: ఆసియా, ఆఫ్రికా దేశాల రెండవ సమావేశం జరగాలని భారతదేశము, ఆసియా, ఆఫ్రికా దేశాలలో మరికొన్ని కోరుతున్నవి. కాని త్వరలో అట్టి సమావేశం జరపాలని ఈనాడు ఏ దేశము ప్రతిపాదించడం లేదు.

నిన్న ఇక్కడ పత్రికావిలేఖరుల గోష్ఠిలో ప్రసంగిస్తూ, ఆసియా, ఆఫ్రికా దేశాల రెండవ సమావేశం ఇప్పట్లో జరగాలని భారతదేశం వాంఛించడం లేదన్నమాట నిజమేనా అని ఒకవిలేఖరి ప్రశ్నించగా భారత ప్రధాని పండిత జవాహర్ లాల్ నెహ్రూ వివరంగా చెప్పారు.

క్రిందటి సంవత్సరం ఆఖరిలోనో ఈ ఏడాది ప్రారంభంలోనో కొన్ని దేశాలు ఈ విషయమై భారతదేశంతో సంప్రతించినవని పండిత నెహ్రూ అన్నారు. ఆయన ఇంకా ఇలా చెప్పారు: "ఆసమయంలో వాస్తవానికి మేమేకాదు మరికొన్ని దేశాలు కూడా అట్టి సమావేశం కొంతకాలం తరువాత ఏర్పాటుచేయాలని చెప్పడం జరిగినది. కాని మేము ఒక తేదీ నిర్ణయించలేదు. సమావేశం జరపడానికి ఏ తేదీ అనుకూలంగా ఉంటుందో నాకు తెలియదు. ఇతర దేశాలతో సంప్రతింపులద్వారా ఒక తేదీ నిర్ణయించవలసి ఉంటుంది. ఏమైనా త్వరలో అట్టిసమావేశం జరపాలని ఈనాడు ఏదేశము ప్రతిపాదించడం లేదు."

## యూరప్ స్వేచ్ఛా వ్యాపారం

లండన్, జూలై 9: యూరప్ స్వేచ్ఛా వ్యాపారంవల్ల కామన్వెల్త్ దేశాలపై కలిగే ప్రభావాన్ని గురించి పది కామన్వెల్త్ దేశాల అధికారులు ఈ రోజుకూడా చర్చలు సాగించారు. ఇదివరలో ఈ విషయాన్ని కామన్వెల్త్ ప్రధానుల సమావేశంలో చర్చించారు. ఈ వ్యాపారం విషయమై, వివిధ ప్రభుత్వాల అధికారులు తమ వైఖరిని వివరిస్తారు. ఆ రాష్ట్రాలతో వీరి సంప్రదింపులు పూర్తి అవుతాయి. వీరు ఈ చర్చల సారాంశాన్ని తమ ప్రభుత్వాలకు నివేదిస్తారు.

# పదవులు ఆక్రమిద్దామని మాలెంకోవ్ మాలటోవ్‌ల యత్నం
## పోలిష్ పత్రిక కథనం

వార్సా, జూలై 9: ఈమధ్య రష్యాలో శ్రీ మాలటోవ్ వర్గం పన్నిన కుట్ర చాలా పెద్ద ఎత్తులోదని, శ్రీ క్రుశ్చేవ్‌ను త్రోసివేసి శ్రీ మాలటోవ్ పార్టీ కార్యదర్శి అవుదామని, శ్రీ మాలెంకోవ్‌ను, శ్రీ బుల్గానిన్ స్థానే ప్రధానమంత్రిని చేద్దామని ఇట్లా అధికారాన్నంతా తమ హస్తగతం చేసుకుందామని చూశారని పోలండు కమ్యూనిస్టు పార్టీ పత్రిక "త్రైబ్యునా లూదు" వ్రాస్తున్నది.

శ్రీ మాలటోవ్, శ్రీ మాలెంకోవ్, శ్రీ కగనోవిచ్ ప్రభృతులను పార్టీలోనుంచి తొలగించడానికి ముందు మూడు రోజులపాటు పార్టీ నాయకత్వంకోసం తగాదా నడిచిందని గూడా ఈ పత్రిక మాస్కో విలేఖరి వ్రాస్తున్నాడు.

ఈ తగాదా అంతా శ్రీ క్రుశ్చేవ్ విధానాలను పురస్కరించుకొని ప్రారంభించారని, శ్రీ క్రుశ్చేవ్ వ్యవసాయానికి, వాటికి ప్రాముఖ్యం ఇవ్వడం వీరికి నచ్చక, ఆయన మితవాద సేద్యవిపర్యయబుద్ధి అయినట్లు తగాదా పెట్టారనిగూడా ఈవిలేఖరి వ్రాస్తున్నాడు. "క్రుశ్చేవ్, పాలతో, వెన్నతో, మాంసంతో, అమెరికా అధిగమించాలని చూడటం అపహాస్యంగావుంది. ఇది మితవాదిఅయిన సేద్యగానిబుద్ధి. మార్క్సువాదులకు పరిశ్రమలు ప్రధానమైనటువంటివి. ఈ పరిశ్రమల విషయంలో రష్యా, అమెరికాకన్నా వెనకబడివుంది. అందువల్ల వ్యవసాయాన్ని గూర్చిన కార్యక్రమాలు, నినాదాలు, తత్వవిపర్యయాలే అవుతాయి" అని శ్రీ మాలెంకోవ్ వాదించారట.

ఈ తగాదాలను రష్యా కమ్యూనిస్టు పార్టీ అధిష్ఠానవర్గంలో తేల్చుకోవాలనే, మాలెంకోవ్ - మాలటోవ్ వర్గం పట్టుబట్టినట్లు, కేంద్రసంఘంలో తేలుద్దామని, శ్రీ క్రుశ్చేవ్ పట్టుబట్టినట్లు గూడా ఈ విలేఖరి వ్రాతలనుబట్టి తెలుస్తున్నది. శ్రీ మాలెంకోవ్ అభ్యర్థనను పురస్కరించుకునే, రష్యా కమ్యూనిస్టుపార్టీ అధిష్ఠానవర్గం ఆలోచన సమావేశమైంది. లెనిన్‌గ్రాడ్ నగరం 250వ వార్షికోత్సవ వ్యవహారాన్ని చర్చిద్దామంటూ ఆయన, అధిష్ఠానవర్గం సమావేశాన్ని కోరారు. సమావేశంలో శ్రీ క్రుశ్చేవ్ సంగతిని చర్చించాలని పట్టుబట్టారు. ఈ అధిష్ఠానవర్గం సమావేశం మార్షల్ బుల్గానిన్ అధ్యక్షతను జరిగింది.

సమావేశం మొదలుకాగానే, శ్రీ మాలెంకోవ్ పార్టీ నాయకత్వాన్ని గూర్చి విమర్శ మొదలుపెట్టారు. "వ్యవసాయ ద్రవ్యోత్పత్తివిషయంలో అమెరికాతో పోటీపడటం అపహాస్యంగావున్నదని విమర్శించారు. పరిశ్రమలను గురించి శ్రద్ధచూపించనందుకు విమర్శించారు. "పారిశ్రామికోత్పత్తిలో మనం ఇంకా అమెరికాకంటే వెనకపడివున్నాము. కాని నినాదాలుమాత్రం మించిపోయినట్లు ఇస్తున్నాము. ఇది మంచిపనికాదు" అని శ్రీ మాలెంకోవ్ వాదించారు.

రష్యాలో ప్రచురితం అయ్యే లెనిన్‌గ్రాడ్‌స్కయాప్రావ్దా అనే పత్రిక వ్రాతలను కొన్నింటిని, ఈ విలేఖరి ఇక్కడ ఉటంకించి "శ్రీ మాలెంకోవ్ పార్టీ విధానాన్ని మితవాదివిపర్యయంగా నిందించినట్లు వ్రాశారు. కాని మాస్కోలో చెప్పుకుంటున్న దాన్నిబట్టి, ఈ నింద, ఇంతకన్నా ఘోరంగా వున్నట్లు తెలుస్తోంది. "శ్రీమాలెంకోవ్, పార్టీ నాయకత్వాన్ని, మితవాది సేద్య విపర్యయంగా" నిందించారు అని ఈ విలేఖరి అంటున్నారు.

రష్యా కమ్యూనిస్టుపార్టీ అధిష్ఠానవర్గం ఈ సమావేశంలో శ్రీ మాలెంకోవ్, శ్రీ మాలటోవ్, శ్రీ కగనోవిచ్‌లు ఒక్కమాటమీద వుండి వాదించారు. అందువల్లనే వీరి ఆలోచన ఇప్పటిదికాదని, ఎప్పటినుంచో రాజుతూ వున్నదని తేలింది. అయితే ఇప్పుడే ఎందుకు వీరు ఇట్లా బయటపడ్డారు, అంటే, ఆ కారణం ఏమిటో, రష్యా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సంఘంలో బయటపడిపోయింది. రష్యా కమ్యూనిస్టు పార్టీ అధిష్ఠానవర్గంలో కొంతమంది సభ్యులు ఫ్లూలో వేగు. ఆ అదను చూచుకొని, వీరు, అది పాపవర్గంలో ఈ ఎత్తువేశారు. అని లెనిన్‌గ్రాడ్ పత్రిక వ్రాస్తోంది.

ఆ తర్వాత, అంటే, జూన్ 22 వ రష్యా కమ్యూనిస్టుపార్టీ కేంద్రసంఘం సమావేశం జరగడం, అందులో, మాలెంకోవ్-మాలటోవ్ వర్గానికి బలం లేదని తేలిపోవడం, ఆ తర్వాత, ఈ వర్గాన్ని అధికారంలోంచి, నాయకత్వంలోంచి, బర్తరఫుచేయడం అన్నీ జరిగిపోయినాయి. ఆ కేంద్రసంఘంలో, ఈ వర్గాన్ని ఒక్కరుగూడా బలపరచలేదు.

రష్యాలో జరిగిన ఈ వ్యవహారాన్ని గురించి, శ్రీ క్రుశ్చేవ్ నెను చెకస్లోవేకియాలో రెండుమాటలు చెప్పారు: జలినాలో జరిగిన బహిరంగసభలో మాట్లాడుతూ "తేల్లని మందలోంచి,

## దక్షిణ ప్రాంతీయ మండలి
### రేపు మొదటి సమావేశం

మదరాసు, జూలై 10: దక్షిణప్రాంతీయ మండలి ప్రథమసమావేశ ప్రారంభోత్సవాన్ని సాయంత్రం 4 గంటలకు గిండీ రాజభవనంలో దేశీయాంగమంత్రి పండిత గోవిందవల్లభపంత్ జరుపుతారు. మండలిలో ఆంధ్రప్రదేశ్ మదరాసు, కేరళ రాష్ట్రాలు సభ్యులు.

శ్రీ పంత్ ప్రారంభోపన్యాసం తర్వాత మండలి సమావేశాలు ఆ యా సభ్యరాజ్యాలలో జరుగవలసిన వరుస క్రమాన్ని ఉపాధ్యక్షుల ఎన్నిక వరుస క్రమాన్ని గురించి సమాలోచనలు జరుగుతవి.

ఆంధ్రప్రదేశ్ నుంచి మండలి సమావేశానికి ప్రతినిధులుగా హాజరయ్యే ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి, అంతరంగిక వ్యవహారాలశాఖ మంత్రి శ్రీ కే.వి. రంగారెడ్డి యీసాయంత్రం హైదరాబాదునుంచి విమానంలో మద్రాసు వచ్చారు.

ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి రాజభవనంలోను, శ్రీ కే. వి. రంగారెడ్డి ప్రభుత్వ అతిథిగృహంలోను బస చేస్తున్నారు. ఆంధ్ర రెవిన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావు నిన్న నే మద్రాసు వచ్చారు.

### దక్షిణమండలం అభివృద్ధికి పథకాలు

దక్షిణ ప్రాంతీయమండలిలో సభ్యరాజ్యాలైనఆంధ్రప్రదేశ్, మద్రాసు, కేరళ రాష్ట్రాలలో 1957-58 సంవత్సరమునకు ఉద్దేశించి ఉన్న అభివృద్ధి పథకాలు,సహజసంపదలకు సంబంధించిన యీక్రిందిఅంశాలను ప్రాంతీయమండలి సమావేశంవారు దృష్టిలో ఉంచుకొని దక్షిణమండలం అభివృద్ధి మార్గాలను ఆలోచిస్తారు.

ఈ దక్షిణ మండలం 171800 చదరపు మైళ్ల విస్తీర్ణంతో 749 లక్షల జనాభా కలిగి ఉన్నది.

ఈ మూడు రాష్ట్రాల్లో మొత్తం జనాభాలో వ్యవసాయదార్ల నిష్పత్తి ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు 67 పాళ్లు మదరాసులో 63 పాళ్లు, కేరళలో 52 పాళ్లు అయిఉన్నది. ఇనుము, బొగ్గు, అభ్రకము మాంగనీసువంటి ముఖ్య ఖనిజములు యీ మండలంలో తక్కువ. అయితే కేరళలో థోరియం, ఇల్మనైట్ వంటి ఖనిజాలు లభిస్తున్నవి. దక్షిణ మండలంలో అక్షరాస్యత చాలా ఎక్కువ.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో యీ మూడు రాష్ట్రాలకు కలిపి ఆదాయం రూ 1796 లక్షలు అయి ఉన్నది. రెండవ ప్రణాళిక పథకాల మొత్తం ఖర్చును 2343 లక్షలు యీ ఆదాయం తగ్గుతుంది.

ద్వితీయ ప్రణాళికక్రింద అధికాహారోత్పత్తి 326 లక్షల టన్నులవరకు ఎక్కువగా జరిగి యీ మండలం స్వయం సమృద్ధిని సాధించటానికి పథకాలు తయారై ఉన్నవి.

1957-58 సం. అభివృద్ధి పథకాల క్రింద ఆంధ్రలో రూ 3419 లక్షలు మద్రాసులో రూ 8202 లక్షలు, కేరళలో రూ 1758 లక్షలు వ్యయం చేయటానికి తలపెట్టి ఉన్నారు.

నీటి పారుదల విద్యుచ్ఛక్తి పద్దుల క్రింద ఆంధ్ర ప్రదేశ్‌లో రూ 1597 లక్షలు, మద్రాసులో 1373 లక్షలు, కేరళలో రూ 648 లక్షలు, సంఘ సంక్షేమ కార్యాలకు ఆంధ్రలో రూ 648 లక్షలు మద్రాసులో రూ 772 లక్షలు కేరళలో రూ 528 లక్షలు వినియోగం అవుతవి.

ద్వితీయ ప్రణాళిక పథకాల అమలు నిమిత్తం 1957-58 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సమకూర్చుకో గలడబ్బురూ97లక్షలు.కేంద్రప్రభుత్వం దాదాపు రూ 24 కోట్లు ధనసహాయం చేస్తుంది. ఆప్రకారం మద్రాసు సేకరించగల రూ 14 కోట్లకు కేంద్రప్రభుత్వంనుంచి రూ 18 కోట్లు సహాయం లభిస్తుంది. కేరళకు ఉండే సాధన సంపత్తి రూ 95 లక్షలు కాగా కేంద్ర ప్రభుత్వం రూ 8 కోట్లు సహాయం చేస్తుంది.

# అందరూ ఆయుధాలు తగ్గిస్తేనే రష్యా కూడా తగ్గిస్తుంది
## సోషలిస్టు దేశాలకు తమ ఆసరా ఉందని క్రుశ్చేవ్ హెచ్చరిక

ప్రాగ్, జూలై 9: ఒక్క రష్యా చేత నిరాయుధీకరణం చేయించి, తాము హాయిగా ఆయుధసంపదతో రెచ్చిపోవాలని పాశ్చాత్యరాజ్యాలు ఎత్తులువేస్తే, అవి చెల్లవని. అంతా నిరాయుధీకరణకు దిగితేనే రష్యా గూడా దిగుతుందని రష్యా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి శ్రీ నికితా క్రుశ్చేవ్ చెకొస్లావేకియాలో ఓలోమోక్ అనే చోట మాట్లాడుతూ అన్నారు.

ఈ సభలో పాశ్చాత్యరాజ్యాలను శ్రీ క్రుశ్చేవ్ ఇలా ప్రశ్నించారు: "పాశ్చాత్యదేశాల పెద్దమనుష్యులు కోరుకుంటున్నది, కావాలనుకుంటున్నది ఏమిటి? మాకు ఆయుధాలు లేకుండాచేసి, అంటే మా ఆయుధ బలం, సైనికబలం తగ్గేటట్టు చేసి, తర్వాత, కవుజుపిట్టను పట్టిచేతులలో కాజేసినట్లు, మమ్మల్ని గూడా కాజేద్దామని ఆలోచనలుచేస్తున్నారా? అవి సాగవు. సాగుతాయన్న పిచ్చిభావం వుంటే నేను చెప్పేది ఏమీ లేదు. ఎవరు తీసుకున్న గోతిలో వారే పడతారు."

"ఉదజని బాంబును గురించి, నిరాయుధీకరణాన్ని గురించి, ఇంకా ఇతర విషయాలనుగురించి, మాట్లాడ్డానికి రష్యా ఎప్పుడూ సిద్ధంగానేవుంది. ఈ విషయాలను గూర్చి రష్యా ప్రభుత్వ భావాలేమిటో వాలేరియన్ జోరిన్, లండన్‌లో జరుగుతున్న సమితి నిరాయుధీకరణోపసంఘ సమావేశంలో వివరిస్తూనే వున్నారు. కాని ఆ సభలో మాటలు మాత్రం కోటలు దాటుతున్నట్లు విన్పిస్తున్నాయి. పనిమాత్రం జరగడం లేదు." అన్నారు.

సోవియట్ నాయకులు ప్రత్యేకమైన రైలులో ఇక్కడికి వచ్చారు. దారిలో జలినా నగరంవద్ద ఆగారు.

శ్రీ బుల్గానిన్, శ్రీ క్రుశ్చేవ్, రష్యన్ ప్రతినిధివర్గంలోని ఇతర సభ్యులు, రేపు ప్రాగ్ చేరుకుంటారు. వీర్నాలో మాట్లాడుతూ, తాము చెకొస్లావేకియా, రష్యాల మధ్య స్నేహసంబంధాలను పెంపొందించడానికి వచ్చామని, అంతేగాని ఏవో అభిప్రాయభేదాలు, తగాదాలు వుంటే వాటిని తీర్చుకోడానికి రాలేదని, అసలు ఈ రెండు రాజ్యాలమధ్య తగాదా లేమీ లేవని శ్రీ క్రుశ్చేవ్ వివరించారు. "సోషలిస్టు దేశాల మధ్య, శాంతికాముదేశాలమధ్య, ప్రజల మధ్య స్నేహసంబంధాలను పెంపొందించడమే మా లక్ష్యం" అని ఆయన అన్నారు.

### శాంతికోసం పోరాటం
#### జలినాలో మాట్లాడుతూ శ్రీక్రుశ్చేవ్

వల్లని మేకలను గెంటివేశాము. తెవులు పుచ్చుపోని ధృవీకరించి, అవతలికి నెట్టివేశాము" అన్నారు.

ఇలా అన్నారు: శాంతికోసం మనం పోరాటం సాగిస్తున్నాము. ఆపోరాటం ఎప్పుడుఆగదు. ఇందులో హేతుజ్ఞానం మనకు దారి చూపిస్తోంది. మన లక్ష్యాలలో మనకు అచంచలమైన విశ్వాసం వుంది. ఆవిశ్వాసం బలాన్ని ఇస్తోంది. మనం అందుకే శాంతిని కోరుతున్నాము. ప్రజల ఐకమత్యాన్ని కోరి, శాంతిని వాంఛిస్తున్నాము.

### కార్మికబలం ప్రపంచాన్ని జయిస్తుంది

"అమెరికాలో ధనవంతులు బంగారపు మూటలపైన కూర్చుంటున్నారే గాని, వారి మనస్సులకు శాంతిఅన్నది వుండటం లేదు. కార్మికబలం అజేయమైంది. అది ప్రపంచాన్ని జయిస్తుంది. అందులో నాకు ఎటువంటిఅనుమానమూ లేదు. అయితే ఇందుకోసం యుద్ధం జరగాలని కొందరు అంటూవుంటారు. అది తప్పు. యుద్ధం జరగక్కరలేదు; ఏమీ జరగక్కరలేదు.అటువంటిదేమీ జరక్కుండానే, కార్మికలోకం జయిస్తుంది.

### యుద్ధం వస్తుందా?

"యుద్ధం వస్తుందా? అదిరాకుండా చేద్దామనే, అన్నివిధాలా ప్రయత్నం చేస్తున్నాము. కాని అది మన ఒక్కళ్లమీదనే ఆధారపడివున్న విషయం కాదు. అయినా యుద్ధాన్ని నివారించడానికి ఎంత చెయ్యవచ్చో అంతా చేస్తున్నాము. మనకు బ్రహ్మాండమైన పరిశ్రమలు వున్నాయి. జనం వున్నారు. సైన్యం వుంది. స్నేహితులు వున్నారు. రష్యా సరిహద్దులను, ఇతర సోషలిస్టు రాజ్యాల సరిహద్దులకు ఎటువంటి భయంగాని లేదు. ఆ సరిహద్దులను అన్నింటిని సుష్ఠుగా రక్షించుకొనే శక్తి మనకు వుంది.

### సోషలిస్టు రాజ్యాలన్నింటికీ రక్షణ

"సోషలిస్టు రాజ్యాలన్నింటికి రక్షణ వుంది. ఈ రాజ్యాలలో దేనిని ఎవరు ఏమిచేయచూచినా, చేతులుకొల్పుకొని, అవతలికి పోవలసివస్తుంది. ప్రతిసోషలిస్టు దేశాన్ని రక్షించే పూచీ రష్యా తనమీద పెట్టుకుంటుంది. అట్లా అని రష్యా తానై ఎప్పుడూ యుద్ధానికి దిగదు. దురాక్రమణ జరిగితే భ్రాంతిరాదు. తన బలాన్నంతా ఆ దురాక్రమణనుదండించడానికి వినియోగిస్తుంది. ఈ మధ్య ఈజిప్టుమీద, బ్రిటన్, ఫ్రాన్సు, ఇజ్రాయిల్‌లు కలిసి, దురాక్రమణ సాగించాయి. రష్యా అప్పుడు తన బలాన్నంతా వినియోగించి, ఆ దురాక్రమణ విఫలం అయ్యేట్లు చేసింది. తన చుట్టూ దుర్మార్గాలు జరుగుతూవుంటే, రష్యా, ఉదాసీనంగా వుండదు.

# రష్యాలో మార్పులు ప్రజలతోనే మొదలు
## ప్రాచ్య, పాశ్చాత్య వైషమ్యాలు తగ్గుతాయని నెహ్రూ ఆశాభావం

దిహేగ్, జులై 9: రష్యా పరిపాలనలో కఠిన నిర్బంధాలు సడలించాలనేది, ఉన్న తాధికారంలో ఉన్న వారెవరో చేసిన నిర్ణయంకాదు; ఆ సడలింపు అనే భావం ప్రజలలోనే పుట్టి అక్కడే ప్రారంభమై అధికారవర్గానికి వ్యాపించినది; ఈ మార్పు యదార్థమైన మార్పు; అని, భారత ప్రధాని శ్రీ జవహర్లాల్ నెహ్రూ ఇక్కడ పత్రికా సమావేశంలో అన్నారు.

రష్యాలో ఇటీవలి సంఘటనల మూలంగా, రెండు ఫలితాలు తప్పక కలుగవచ్చునని శ్రీ నెహ్రూ అన్నారు. 1. ఇతర రాజ్యాలతో సంబంధాలు కొంత బాగుపడతాయి. అంటే ప్రాచ్య, పాశ్చాత్య రాజ్యవర్గాలమధ్య సంబంధాలు బాగుపడతాయి. 2. రష్యాలో నిర్బంధ పరిపాలన విధానం, ప్రజల జీవనంలో కానవచ్చే నిర్బంధాలుఅ నేవి మరింత సడలవచ్చు.

రష్యాలో ఒక పరిణామం ప్రారంభమయింది. అది కొనసాగుతూనే వుంటుంది. అది కొంత హంగరీలో సంఘటనలవల్ల ఆగింది.

ఈ పరిణామం ఎవరో ఉన్నతాధికారంలో ఉన్నవారు నిర్ణయించినది కాదు; ప్రజలలోనే ప్రారంభమైనది. ప్రజలవద్దనుంచి ఇది ఉన్నతాధికారులవరకూ వ్యాపించినది. అది ఇప్పుడింకమళ్ళీ కొనసాగవచ్చు. అంటే అంతరంగిక వ్యవహారాలలోనూ, అంతర్జాతీయ వ్యవహారాలలోనూ కూడా ఆ పరిణామం ఇంకా కొనసాగవచ్చు.

### వలసయుగంఅంతరించాలి

అమెరికా ఫ్రాన్సుకు సహాయం చెయ్యడం మానివేసి, ఇంక ఆల్జీరియా స్వాతంత్ర్యాన్ని బలపరచాలి, అని ఇటీవల అమెరికన్ సెనేటర్ జాన్ కెన్నెడీచేసిన ప్రకటన గురించి విలేఖరులు శ్రీ నెహ్రూ అభిప్రాయం అడిగారు.

శ్రీ కెన్నెడీ ప్రకటనను చర్చించడం తమకు ఉచితంకాదని శ్రీ నెహ్రూ అన్నారు. అన్యరాజ్యాల ప్రాబల్యంలోనూ, పరిపాలనలోనుఉన్న వలస దేశాలన్నిటికీ స్వాతంత్ర్యం లభించవలసిందే, అని భారతదేశం అభిప్రాయమైనట్లు ఇదివరకే అందరికీ తెలిసిన విషయం. వలసయుగం అంతరించాలి. వలస విధానం అంతరిస్తున్నమాట నిజమే; కాని ఇంకా కొంత మిగిలిఉంది. ఈ అంతరించే ప్రక్రియ శాంతియుతంగా సాగిపోవాలని తమ అభిలాష, అని శ్రీ నెహ్రూ చెప్పారు.

ఆల్జీరియా సమస్యకూడా, ఆ దేశపు ప్రజలూ ఫ్రాన్సుల మధ్య, శాంతియుతంగా పరిష్కారం కావాలని వారి అభిలాష. ముమ్ముందు ఆవిధంగా పరిష్కారం కాగలదనే ఆశిస్తున్నారు.ఎవరికీ ఏ మేలూ చేకూర్చని ఈ సంఘర్షణలు ఆవిధంగా సాగడం చాల బాధ కలిగిస్తున్నదన్నారు.

### బ్రిటన్ ఈజిప్టులమధ్య రాజీకృషి

త్వరలో శ్రీ నెహ్రూ ఈజిప్టు అధ్యక్షుడు శ్రీ నాసర్‌ను కలుసుకోనున్నారు కాబట్టి, బ్రిటన్ ఈజిప్టుల మధ్యరాజీకుదర్చడానికి కృషిచేస్తారా, అని విలేఖరులు అడిగారు.

శ్రీ నాసర్‌కు తాను అందచెయ్యవలసిన సందేశం ఏమీ లేదని, శ్రీ నెహ్రూ జవాబిచ్చారు. ఒకటి రెండు రోజుల్లో శ్రీ నాసర్‌ను కలుసుకోబోతున్నమాట నిజమే. కలుసుకొన్నప్పుడు ఉభయులకూ సంబంధించిన సమస్యలను చర్చించగలరు.

ఆ రెండు రాజ్యాలమధ్యా పునస్సఖ్యతకోసం సహాయపడాలని ఎంతైనా కోరిక ఉన్నదన్నారు. ఇది వరలో ఇటువంటిసమస్యపైన సహాయంచేసి ఉన్నారు కూడా.

ఇటీవల బ్రిటన్‌లో ప్రదర్శితమైన నాసర్ టెలివిజన్‌గోష్ఠి గమనిస్తే, శ్రీ నాసర్ మైత్రికాంక్ష స్పష్టంగా తెలుస్తున్నది. అందువల్ల అటువంటి సమస్యలను చర్చించడంలో చిక్కు ఉండబోదన్నారు.

### పశ్చిమన్యూగినీ

పశ్చిమన్యూగినీ గురించి హాలండ్ ఇండొనీషియాలమధ్య వివాదంగురించిన ప్రశ్నకు జవాబిస్తూ, మళ్లీ శ్రీ నెహ్రూ పాశ్చాత్య రాజ్యాలు ఇతర దేశాలను తమవలసలో ఉంచుకొనే పద్ధతికి కాలదోషం పట్టిందన్నారు. ఈ ప్రాంతాలు స్వాతంత్ర్యం పొందాలనే భారతదేశం అభిలాష-అయితే సద్భావంతో పొందాలి. ఈ సమస్య సైకాను, ఇతరసమస్యలన్నిటిని హాలండ్ ఇండొనీషియా ప్రభుత్వాలు చర్చించుకోవాలని శ్రీ నెహ్రూ సూచించారు.

ఇండొనీషియా స్వాతంత్ర్యం పొందిన వెంటనే, ఈ న్యూగినీ సమస్యను తీసుకువచ్చింది. ఈ విషయంలో ఆసియా ప్రజలు ఇండొనీషియా నే సమర్థిస్తున్నారు.

"ఒప్పందం ఏమూలంలో పదరాలో నేను చెప్పవలసింది కాదు, కాని వలస వాదానికి ప్రతికూలంచ మైనందు వల్ల, మాకు ఇండొనీషియా పట్లనే సానుభూతి ఉంటుంది. వలసప్రాబల్యం అనేది ఎప్పుడూ సహించరానిదే, అని శ్రీ నెహ్రూ అన్నారు.

### కామన్వెల్త్ ఆర్థిక మంత్రుల సమావేశం

కెనడా ప్రధాని ఆహ్వానంపై ఒటావాలో జరుగనున్న కామన్వెల్త్ ఆర్థిక మంత్రుల సమావేశం గురించి విలేఖరులు ప్రశ్నించారు.

ఈ సమావేశంవల్ల ఫలితాలేమి కలుగుతాయో చెప్పలేమని శ్రీనెహ్రూ అన్నారు. ఏది ఏమైనా, యూరోపియన్ స్వేచ్ఛా వ్యాపార పథకంవల్ల భారతదేశ వ్యాపారంలో ఎటువంటి మార్పులు వస్తాయో, జెనీవా వ్యాపార సుంక ఒప్పందాలు ఏమవుతాయో తెలిసికోవాలని భారతదేశం ఆసక్తితో వుంది. ఈ పథకంవల్ల యూరోపియన్ రాజ్యాల ఆధీనంలో వున్న వలసదేశాల స్వాతంత్ర్యోద్యమాలకు అంతరాయం ఏర్పడుతుందేమో కూడా పరిశీలించాలి అన్నారు.

### చైనా భారతదేశాల మధ్య పోటీలేదు

చైనా గురించిన ప్రశ్నలకు జవాబిస్తూ, శ్రీ నెహ్రూ, చైనా భారత దేశాలమధ్య పోటీ ఏదీ సాగడం లేదన్నారు. చైనాలో కమ్యూనిస్టు విప్లవం జయించక పూర్వమే, భారతదేశంలో ప్రథమ పంచవర్ష ప్రణాళిక ప్రారంభమయింది.

రెండుదేశాలకూ పోలికలున్న సమస్యలు అనేకం ఉన్నాయి. రెండు మూడేళ్లుగా రెండు రాజ్యాల ప్రతినిధివర్గాలూ రావడం పోవడం జరుగుతోంది. రెండు రాజ్యాలూ ఒక దానిని చూసి మరొకటి నేర్చుకున్న అంశాలు అనేకం ఉన్నాయి.

సమస్యలను భారతదేశం రాజకీయ ఆర్థిక ప్రజాస్వామ్య విహిత దృక్పథంతో పరిశీలిస్తుంది.

"కార్య నిర్వహణలో మా మార్గమే ఉత్తమం అని మా విశ్వాసం" అన్నారు శ్రీ నెహ్రూ.

### చాంగ్‌కైషేక్‌తో చిన్న తగవు

టిబెట్టుపై జరిగిన దిదురాక్రమణ కాదా, అని విలేఖరులు ప్రశ్నించారు.

టిబెట్టు ఎన్నడూ స్వతంత్రరాజ్యం కాదని శ్రీ నెహ్రూ జవాబిచ్చారు. ఆదేశం ఎప్పుడూ చైనాక్రింద సామంత దేశంగానే పరిగణింపబడింది. చైనా కల్లోలంలో మునిగి ఉన్నప్పుడు, టిబెట్టులో అనేక సంవత్సరాలపాటు స్వపరిపాలన సాగినమాట వాస్తవమే.

టిబెట్టు సందర్భంలో 1947 లో అప్పటి చైనా అధ్యక్షులు శ్రీ చాంగ్ కైషేక్‌తో తమకు చిన్నతగవు వచ్చిందని శ్రీ నెహ్రూ చెప్పారు.

1947 లో ఢిల్లీలో ఒక సమావేశానికి ఏర్పాటేయిన మందిరంలో ఒక గోడపైన పెద్దదేశపటంఒకటుండి. అందులో టిబెట్టు స్వతంత్రరాజ్యంగా సూచించబడి ఉంది. అది చూసి, అసమ్మతితో, చాంగ్ ప్రతినిధి వర్గం ఆమందిరంనుంచి లేచివెళ్లిపోయారు.

తమకు తెలిసినంత వరకు, టిబెట్టులో మత వ్యవస్థలో కాని ఆర్థిక వ్యవస్థలో కాని చైనా అధికారులు జోక్యం చేసుకోడం లేదని శ్రీ నెహ్రూ అన్నారు. ముమ్ముందు ఏంచేస్తారో తమకు తెలియదన్నారు.

### అణ్వస్త్ర పరీక్షలు

అణ్వస్త్రపరీక్షలంటే తమకు అసహ్యంఅని శ్రీ నెహ్రూ అన్నారు. ఈపీడ ఎంతత్వరలో వదలిపోతే అంత మంచిది.

కొంతకాలంపాటు పరీక్షలు ఆపుచెయ్యాలనేసూచన మంచిదే. దీనివల్ల ప్రధానమైనసమస్య పోదువరు. నిరాయుధీకరణపై విస్తృతమైన ఒప్పందం కుదరడం వాంఛనీయమే. అణ్వస్త్ర పరీక్షలను తాత్కాలికంగా ఆపుచేస్తే, అటువంటిఒప్పందం కుదరడానికి తగిన పరిస్థితులు ఏర్పడతాయి.

కాశ్మీరుసమస్యపై ప్రశ్నలకు జవాబిస్తూ, పాకిస్థాన్ కాశ్మీరుపై దురాక్రమణ జరిపి, తొమ్మిదేళ్లనుండిచినా ఆక్రమంగా ఆక్రమించిన ప్రాంతాన్ని విడిచిపోవడం లేదన్నారు. ఇంక ఏది చెయ్యబోయేటీయుంటేనా, పాకిస్తాన్ దురాక్రమణ అంతంచేయవలసిందే, అన్నారు.

# కమ్యూనిజం పట్ల నూతన దృక్పథం
## ఆసియాలో కలుగుతోందని బ్రిటిష్ పత్రిక వివరణ

మాంచెస్టర్ (ఇంగ్లండ్), జూలై 9: కమ్యూనిజం పట్ల ఆసియాలో నూతన దృక్పథం అలవడుతోందని 'మాంచెస్టర్ గార్డియన్' పత్రిక సంపాదకీయ వ్యాసంలో పేర్కొంది. అయితే, ఈ దృక్పథానికీ, యూరప్‌లోని కమ్యూనిజానికీ ఎంతో భేదం ఉన్నట్లు పైకి కనిపించవచ్చు. కాని నిజంగాచూస్తే, ఈ భేదా అంత గణనీయం ఏమీకాదు. ఈ నూతన దృక్పథానికి ఒక్కటైనాయే కారణం కాదు. గత ఎన్నికలలో భారతదేశంలోని కేరళ రాష్ట్రంలో ఏర్పడిన కమ్యూనిస్టు ప్రభుత్వం ఈ విషయంలో చాలా ముఖ్యమైనది. దీని ప్రాముఖ్యతను పాశ్చాత్య దేశాలు ఇంకా గుర్తించలేదు. కేరళ ప్రభుత్వంలో సమర్థులు ఉన్నారు. రాజ్యాంగబద్ధంగా కమ్యూనిజం సిద్ధాంతాలను ఆచరణలో పెడతామని వీరు ప్రచారం చేస్తున్నారు. ఈ విధానంలో ఈ ప్రభుత్వం సఫలమయితే ఆసియా కమ్యూనిస్టులకు కేరళ నూతనాదర్శం కావచ్చును. ఆందోళన,ఎన్నికలు, సాంఘిక పరిస్థితులవల్ల అనేక ఆసియా దేశాలలో విజయం కలిగితే, అనవసరంగా దౌర్జన్య పద్ధతులను అవలంబింప వలసిన అవసరం ఏముంది? బర్మా, మలయా కమ్యూనిస్టు పక్షాలు కేరళను గురించి అప్పుడే పరిశీలించాయి. అయితే, ఆసియాలోని కమ్యూనిస్టు పార్టీలు హింస, విప్లవలను విడనాడడం దృష్ట్యా నూతన దృక్పథం సంతృప్తికరమైన విషయం. కాని ఆసియాలోని స్వతంత్రదేశాలు రాజ్యాంగబద్ధంగా వ్యవహరించి, చైనా కొంతవరకూ కమ్యూనిజంవిధానాలనుసడలించే రీతిని వ్యవహరిస్తే, అప్పుడు కమ్యూనిజం మరింత ప్రమాదకరమైనదౌతుంది. ప్రస్తుతం ఆసియాలో కమ్యూనిజంవల్ల తీవ్రపరిణామం ఇండొనీషియాలో కలిగే అవకాశం ఉంది. ఈ దేశ అధ్యక్షుడు శ్రీ సుకర్నో తమ పరిమిత ప్రజాస్వామ్య విధానంవల్ల, ప్రజాస్వామ్యాన్ని అణగద్రొక్కుతున్నారు. పార్లమెంటుకు ప్రత్యామ్నాయంగా ఏర్పాటైన జాతీయసలహా మండలిలో రాజకీయ సూత్రాన్ని అవలంబించడంలో ఆయన విజయం పొందారు. ఐతే శ్రీ సుకర్నో కమ్యూనిస్టు కాదు. కాని ఇండొనీషియా కమ్యూనిస్టుపార్టీ మాత్రం ఆయనను పూర్తిగా సమర్థిస్తోంది. ఎందుచేతనంటే ప్రజాస్వామ్య పద్ధతులలో అధికారంలోనికి వచ్చే అవకాశాలులేవు; పైగా ఈ పరిమిత ప్రజాస్వామ్యంవల్ల వారు అధికారం కైవసంచేసికొనే అవకాశం అధికంగా ఉన్నట్లు కనిపిస్తోంది. కాని వీరి ఆశాభావంవల్ల కమ్యూనిస్టు వ్యతిరేక పక్షాలలో తీవ్రదృక్పథం రావచ్చు. శ్రీ సుకర్నో ఒత్తిడి ఎక్కువైతే, ఆయన సూచనలను ఈ పక్షాలు ప్రతిఘటించవచ్చు అని ఈ పత్రిక పేర్కొంది.

## అణుశక్తిలో అమెరికా గుత్తలేదు
### స్ట్రాస్ ప్రసంగం

వాషింగ్టన్, జులై 9: అణుశక్తి పరిశోధన, శిక్షణ కేంద్రాన్ని, మనీలాలో స్థాపించడం విషయమై నిన్న ఇక్కడ సమావేశమైన 17 రాజ్యాల సభలో మాట్లాడుతూ, అమెరికా అణుశక్తి సంఘం అధ్యక్షుడు శ్రీ లూయిస్ స్ట్రాస్ అమెరికాకు అణుశక్తి ఉత్పత్తి విషయంలో గుత్త ఏమీలేదని, గతంలో లేదని, ఇప్పుడు లేదని, ముందు వుండదని, స్పష్టంగా చెప్పారు.

ఆయన ఈలా అన్నారు: "అమెరికాలో ఈ అణుశక్తి వ్యవహారం తెలిసిన శాస్త్రజ్ఞులు చాలామందివున్నారు. ఇందులో, నిజానికి, అందరు, అమెరికన్లుకారు. ఐరోపాలోని అనేక దేశాలనుంచి వచ్చారు. అదీకాక ఈ అణువిజ్ఞానం ఒక్క అమెరికాలో పుట్టిందికాదు. ఐరోపాలో చాలా మంది ఈ శక్తినిగూర్చి పనిచేశారు.

"అమెరికా ఈశక్తి విషయమై గడించిన విజ్ఞానాన్ని, శ్రీ ఐసెన్‌హోవర్ "శాంతికోసం అణువులు" అన్న ఉద్యమాన్ని పురస్కరించుకొని, అన్ని దేశాలకు ఈ సంగతిని తెలియజేయాలని అనుకుంటున్నది. మనీలాలో ఇప్పుడు ఈ కేంద్రాన్ని స్థాపించడంవల్ల ఆసియాకు గూడా అణువిజ్ఞానం వ్యాపిస్తుంది. త్వరలో ఆ దేశాలుగూడా ఈ విజ్ఞానంలో నిష్ణాతలవుతాయి.

## మహలనోబిస్‌కు చైనా ప్రధాని విందు

లండన్, జులై 9: భారత ప్రభుత్వ గణాంక వ్యవహారాల గౌరవ సలహాదారు ఆచార్య మహలనోబిస్‌కు,ఆయన భార్యకు చైనా ప్రధాని విందుచేశారని చైనా వార్తాసంస్థ ప్రకటించింది. శ్రీ మహలనోబిస్ భారతగణాంకసంస్థ డైరక్టరు, సమితి గణాంకసంఘ అధ్యక్షుడు కూడా. ఈయన జూను 21 న చైనాకు వచ్చారు.

పాకిస్థాన్ పత్రికలు నిత్యం భారతదేశంపై పవిత్రయుద్ధంఅంటూ ప్రకటనలు ఆప్రచురిస్తున్నందుకు శ్రీ నెహ్రూ విమర్శించారు. పవిత్ర యుద్ధం సాగిస్తారని బెదిరింపులు వస్తున్నప్పుడు, ఇంక ఏసమస్యనైనా సరిచర్చించడం కష్టమే, అన్నారు.

# దక్షిణాఫ్రికాలో భారతీయులపై పోలీసు లాఠీప్రయోగం

## న్యాయ విచారణ చేయాలని ట్రాన్స్‌వాల్ కాంగ్రెసు అభ్యర్థన

జోహాన్స్‌బర్గ్, జూలై 9: జాతివివక్షణ చట్టాలపట్ల నిరసన ప్రకటించే నిమిత్తం దేశవ్యాప్తంగా శ్వేతేతర జాతుల వారు ప్రదర్శనలు జరుపుతున్న సందర్భంలో, జూన్ 26 వ తేదీని పోలీసులు భారతీయ ప్రదర్శకులపై లాఠీప్రయోగం చేశారన్న ఆరోపణలు విచారించడానికి న్యాయశాఖాధికారుల సంఘం నియమించాలని ట్రాన్స్‌వాల్ భారతీయ కాంగ్రెసు నేడు తిరిగి అభ్యర్థించినది.

ఈ లోగా నాటి పోలీసు లాఠీ ప్రయోగం కళ్ళారా చూచినవారివద్ద నుంచీ, లాఠీ ప్రయోగానికి గురిఅయినవారివద్దనుంచి ప్రమాణ పూర్వకంగా వివరాలు సేకరించడానికి భారతీయ కాంగ్రెసు ఒక ప్రత్యేకసంఘం నియమించినది.

లాఠీప్రయోగం జరిగిందన్న ఆరోపణలను ఖండిస్తూ లాఠీప్రయోగం జరుగలేదంటూ పోలీసు అధికారులు ప్రకటనలు చేశారు. ఈ ప్రకటనలపై వ్యాఖ్యానిస్తూ భారతీయ కాంగ్రెసు ఇలా ప్రకటించినది: "ఇంగ్లీషుభాషలో ప్రచురితం అయ్యే పత్రికలు, ఏ పక్షానికీ చెందని పరిశీలకులు, మేము చెబుతున్న దానికీ పోలీసులు చెప్పేది సంపూర్ణంగా భిన్నంగా ఉన్నది. కనుక నే న్యాయశాఖాధికారులతో విచారణ సంఘం నియమించవలసిన అవసరం అధికంగా ఉన్నదని మేము గట్టిగా చెప్పవలసి వస్తున్నది. న్యాయశాఖాధికారుల సంఘం మాత్రమే వాస్తవంగా జరిగిన దానిని దక్షిణాఫ్రికాముందు, ప్రపంచం ముందు ఉంచగలదు.

"పోలీసులు ఎట్టి హెచ్చరిక కాని లేకుండా పురుషులమీద, స్త్రీలమీద, పిల్లలమీద లాఠీ ప్రయోగించారని మేము తిరిగి చెబుతున్నాము. లాఠీ ప్రయోగంవల్ల కనీసం 15 మందికి అయినా గాయాలు తగిలినవి. వారిలో ఇరువురు ఆస్పత్రిలో చికిత్స పొందుతూ ఉన్నారు."

ప్రిటోరియాలోని అసిస్టెంట్ పోలీసు కమిషనర్ బ్రిగేడియర్ సి. జె. ఎల్స్, మరొక పోలీసు అధికారి ఈ సంఘటనగురించి చేసిన ప్రకటనలు "వాస్తవానికి సంపూర్ణంగా భిన్నంగా ఉన్న"వని ప్రకటిస్తూ, భారతీయ కాంగ్రెసు వాటిని త్రోసిపుచ్చినది.

ఈ లాఠీ ప్రయోగం జూన్ 26 వ తేదీ సాయంకాలం 6 గంటలకు 8 గంటలకు మధ్య జరిగినట్లు ఆరోపిస్తున్నారు. ఇది జోహానిస్‌బర్గ్‌లోని ఫోర్డ్స్‌బర్గ్‌లో జరిగినది. భారతీయ ప్రదర్శకులు లేవదీసిన రెండు ఊరేగింపులు ఈ లాఠీ ప్రయోగానికి గురిఅయినవి.

### సమ్మె నిరోధించడానికి పోలీసు బందోబస్తు

జూన్ 26 వ తేదీని ఒకరోజు సమ్మె చేయడానికి శ్వేతేతరులు నిర్ణయించారు. ఆ సమ్మె నిరోధించడానికి గాను అంతకు కొలది రోజులు ముందుగా వందలాది పోలీసులను వాడావిడిగా రాండ్‌కు పంపినట్లు ప్రకటించడం జరిగినది. ఆ తేదీకి విశేషమైన ప్రాధాన్యం ఉన్నది. 1952 వ సంవత్సరంలో అన్యాయమైన చట్టాలు ప్రతిఘటించడానికి ఏర్పాటు అయిన ఉద్యమం సరిగా ఆ తేదీనే ప్రారంభమైనది. తిరిగి ప్రజల కాంగ్రెసుకూడా 1955 వ సంవత్సరంలో "స్వాతంత్ర్య పత్రం" ఆ తేదీనే ఆమోదించినది.

ప్రయాణీకుల బస్సులు ఆగేస్థలాల లోను, రైల్వే స్టేషన్‌లలోను ఆ రోజు పనిచేయగోరే శ్వేతేతరుల రక్షణకు పోలీసులు కాపలా ఉంటారనీ శ్వేతేతర జాతులవారు నివసించే గ్రామాలలోను, 'కీలకస్థావరాలలోను' బలమైన పోలీసు దళాలు ఉంటాయని కూడా అధికారులు ప్రకటించారు.

విట్‌వాటర్స్‌రాండ్‌లోని తాత్కాలిక పోలీసు డిప్యూటీ కమిషనరు లెఫ్టినెంట్ కర్నల్ కె. సి. క్రూగర్ ఇలా ప్రకటించారు: "హింసాకాండ జరుగకుండా నిరోధించడానికి, పనిచేయడానికి వచ్చేవారికి రక్షణ కల్పించడానికి పోలీసులు ఉంటారు."

జూన్ 26 వ తేదీని ప్రదర్శనలు జరపమని శ్వేతేతరులను ఉద్బోధిస్తూ కాంగ్రెసు ఉద్యమం కరపత్రాలు ప్రచురించినది. ఈ ఉద్యమంలో ఆఫ్రికనులు, భారతీయులు, రంగుజాతులవారు ఉన్నారు. "జాతి వివక్షణ చట్టాల నుంచి విముక్తి చెందడానికి, 'అనుమతి పత్రాలు ఉండాలని నిర్బంధించే చట్టాల' (పాస్ చట్టాలు) నుంచి విముక్తి చెందడానికి, రోజుకు ఒక పౌను కనీస వేతనంగా సంపాదించడానికి ఈ ప్రదర్శనలు సాధనంగా చేసుకోవా"లంటూ ఆ కరపత్రాల ద్వారా ఉద్బోధించడం జరిగినది.

అయితే ప్రదర్శనలు చేయండంటూ శ్వేతేతరులను ఆ కరపత్రాలలో ఏదీ కోరలేదని ఆ తరువాత ప్రకటించడం జరిగినది. ... ప్రదర్శనలు, సభలు, ప్రార్థనలు, ... జరగాలనిమాత్రమే వాటిద్వారా విజ్ఞప్తి చేయడం జరిగినది.

### వాణిజ్యమండలి బెదరింపు

శ్వేతేతర ఉద్యోగులు జూన్ 26 వ తేదీని పనికి రావాలని, ఆ యా సంస్థలు విజయవంతంగా తమ వ్యాపారం సాగించుకోవడానికి ప్రతిబంధకం కాగలిగిన చర్య ఏమైనా జరిపితే వారి క్షేమానికి భంగం కలుగుతుందని, ఆ యా వ్యాపార సంస్థలు విజయవంతంగా పనిచేయడం మీదనే యజమానులవలె వారుకూడా తమ జీవిత నిర్వహణానికి ఆధారపడి ఉన్నారని శ్వేతేతర ఉద్యోగులు అందరినీ హెచ్చరించాలని జోహానిస్‌బర్గ్ వాణిజ్యమండలి సభ్యులకు సలహా ఇచ్చినది.

సమ్మె చేసే ఉద్యోగులను బర్తరఫ్ చేయవలసినదని ట్రాన్స్‌వాల్ పారిశ్రామిక మండలి సభ్యులకు సూచించినది.

మండలి అధ్యక్షుడు శ్రీ ఎల్. లూలాఫ్స్ ఇలా చెప్పారు: "నిపుణులు కాని పనివారికికూడా రోజుకు ఒక పౌను వేతనం ఇప్పిస్తామని ఆఫ్రికన్ కార్మికుల నాయకులు ఆశచూపుతున్నారు. ఈ వేతనం స్థాయి నమ్మడానికి వీలులేనంత విడ్డూరంగా ఉన్నది. అట్టి నాయకుల ప్రోద్బలంతో ఆఫ్రికన్ కార్మికులు బుధవారంనాడు అక్రమంగా పనికిరామంటూ చేసిన హెచ్చరిక పరిశ్రమకు ఆందోళన కలిగిస్తున్నది. ఈ చర్యను మండలి తీవ్రంగా గర్హిస్తున్నది.

"వాస్తవంగా మన పరిశ్రమలో ఉన్న ఆర్థిక పరిస్థితులదృష్ట్యా ఇది సంపూర్ణంగా బాధ్యతారహితమైన చర్య. పరిణామాలు ఎంతమాత్రమూ లక్ష్యం చేయని సాహసచర్య."

సమ్మె చేయవద్దని దేశవ్యాప్తంగా ఆఫ్రికనులను ఉద్బోధిస్తూ జాతీయ వాసుల వ్యవహారాలశాఖ ఒక ప్రకటన చేసినది.

పోర్ట్ ఎలిజబెత్‌లో ఆఫ్రికన్ జాతీయ కాంగ్రెసు, కార్మికసంఘాల కాంగ్రెసు, ప్రజాస్వామ్యవాదుల కాంగ్రెసు (శ్వేతజాతివారి సంస్థ) జూన్ 26 వ తేదీ 'స్వచ్ఛందంగా సుఖం వర్జించే దినంగా, స్వతంత్ర దినంగా' పరిగణించమని సభ్యులకు సూచించినవి. ఆరోజున మామూలుగా పనికివెళ్ళమని, అయితే బస్సులలో కాని, రైలుబండ్లలో కాని ప్రయాణం చేసే సుఖం వర్జించమని ఆ సంస్థలు సభ్యులకు సలహా ఇచ్చినవి. ఆరోజు ఉదయం 11 గంటలకు కొలది నిమిషాల సేపు ప్రార్థన చేయమని కూడా అవి సభ్యులను ఉద్బోధించినవి.

### 'సమ్మె 50 వంతులు సఫలం'

రాండ్‌లో జూన్ 26 వ తేదీని జరిగిన ప్రదర్శనలపై వ్యాఖ్యానిస్తూ, సమ్మె నూటికి 50 వంతులు సఫలమైనదని వాణిజ్య పారిశ్రామిక కార్మిక వర్గాలవారు చెప్పారు. కొన్ని ప్రాంతాలలో ఇతర ప్రాంతాలలో కన్న ఎక్కువ విజయవంతంగా సమ్మె జరిగినది. కొన్ని ఫాక్టరీలు ఆరోజున మూసివేయవలసి వచ్చినది. మరికొన్ని ఉత్పత్తి చాలవరకు తగ్గించవలసి వచ్చినది. న్యూకాజిల్‌లో పురపాలక సంఘం వారి మార్కెటు వ్యాపారం చాలవరకు స్తంభించినది. మామూలుగా 15 వేల పౌన్ల వ్యాపారం జరిగేది. ఆరోజు నాలుగు వేల పౌన్ల వ్యాపారం మాత్రమే జరిగినది.

ప్రశాంతికి భంగం కలిగించే సంఘటన జోహానిస్‌బర్గ్‌లో మాత్రమే జరిగినది. అది భారతీయ ప్రదర్శనలకు సంబంధించినది. అయితే ప్రదర్శనలకు పోలీసులకు కొట్లాట వచ్చినట్లు పత్రికలలో ప్రచురితమైన వార్తలు అబద్ధమని అసిస్టెంట్ పోలీసు కమిషనరు బ్రిగేడియర్ ఎల్స్ చెప్పారు. ప్రదర్శన జరిగిన సమయంలో పోలీసులకు ఆధిపత్యం వహించిన అధికారి అట్టి కొట్లాటలు జరిగిన సంగతి తనకు తెలియదని చెప్పినట్లు ఆయన వెల్లడిచేశారు.

ముస్లిమ్ మహిళల నాయకత్వంక్రింద పోతున్న భారతీయ ప్రదర్శకుల ఊరేగింపును పోలీసులు అటకాయించారని బ్రిగేడియర్ ఎల్స్ చెప్పారు. ఊరేగింపు అనుమతి చూపమని పోలీసులు కోరారు. అట్టి అనుమతిపత్రం ఏమీ లేదని భారతీయమహిళలు సమాధానం ఇచ్చారు. వారిపేర్లు, చిరునామాలు చెప్పమని పోలీసులు అడిగారు. కానివారు చెప్పడానికి నిరాకరించారు. అప్పుడు వారిని పోలీసు స్టేషన్‌కు తీసుకొనివెళ్ళారు. "ఊరేగింపులో ఉన్నవారు ఊరేగింపు విరమించుకొని క్రమశిక్షణతో అక్కడినుంచి వెళ్ళిపోయారు." ఇది ఆయన కథనం.

భారతీయ ప్రదర్శకుల రెండవ సమూహం పోలీసులురావడం చూడగానే చెదిరిపోయినదని ఒక పోలీసు అధికారి చెప్పారు.

కాని ఈ ప్రకటనలు సరిఅయినవి కావని కాంగ్రెసు ప్రకటించినది. ఇంగ్లీషు వార్తాపత్రికల విలేకరులు ఇరువురుకూడా వాటిని ఖండించారు. పోలీసులు ఆకస్మికంగా ప్రదర్శకులపై పడి కొట్టారని వారు చెప్పారు. కొందరు పోలీసులవద్ద నాలుగు అడుగుల పొడవైన లాఠీలు ఉన్నవనికూడా వారు ప్రకటించారు. పోలీసు అధికారులు దీనిని ఖండించారు.

"చెదిరిపొమ్మని పోలీసులు మమ్మల్ని హెచ్చరించలేదు. ఆకస్మికంగా మీద పడికొట్టా"రని ఊరేగింపులో ఉన్న ట్రాన్స్‌వాల్ కాంగ్రెసు సభ్యుడు శ్రీ ఎస్. సాలోజీ చెప్పారు. ఆయనకుకూడా గాయాలుతగిలినవి. పదిమందికి గాయాలుతగలడం చూచినట్లు పోలీసులు 100 మందికిపైగా ఉన్నట్లు ఆయన చెప్పారు.

పోలీసులాఠీ ప్రయోగంపట్ల నిరసన తెలియపరచుతూ ఆఫ్రికన్ జాతీయ కాంగ్రెసు, దక్షిణాఫ్రికా భారతీయ కాంగ్రెసు, దక్షిణాఫ్రికా ప్రజాస్వామ్యవాదుల కాంగ్రెసు (శ్వేతజాతివారిది), దక్షిణాఫ్రికా రంగుజాతుల ప్రజలసంస్థ, దక్షిణాఫ్రికా కార్మిక సంఘాల కాంగ్రెసు న్యాయశాఖా మంత్రికి తంతివార్తలు పంపినవి.

గాయాలుతగిలినవని చెబుతున్నవారు కనీసం 100 మంది అయినా ఉన్నారని కాంగ్రెసు ప్రతినిధి ఒకరు చెప్పారు.

## లోక్‌సహాయకసేన శిబిరం

హైదరాబాదు, జూలై 9: ఆదిలాబాదులో జూలై 20 నుంచీ లోక్ సహాయక సేన శిబిరం నిర్వహిస్తారు. ఈ శిబిరంలో శిక్షణ పొందదలచుకొన్నవారి సమీకరణ జూలై 14 నుంచి 19 వరకూ, సికిందరాబాదు, ఆసిఫాబాదు, లక్షెట్టిపేట, నిర్మల్, ఆదిలాబాదులలో జరుగుతుంది.

## జంటనగరాలలో విద్యాలయాలు

హైదరాబాదు, జూలై 9: జంట నగరాలలో విద్యాలయాలు నిన్న తెరిచారు. విద్యార్థులు నూటికి 25 నుంచి 50 మందిదాకానే హాజరైనట్లు తెలిసింది.

# భద్రాద్రివద్ద వంతెన

## కేంద్ర సహాయానికి త్వరలో రాష్ట్ర ప్రభుత్వ అభ్యర్థన

హైదరాబాదు, జూలై 9: "భద్రాచలంవద్ద గోదావరిపై వంతెనకట్టడానికి చేసిన పరిశోధనల నివేదిక ప్రభుత్వానికి అందింది. ఈ విషయంపై ప్రభుత్వం త్వరలోనే ఒక నిర్ణయం చేసి, తగు సహాయం ఇవ్వవలసిందిగా కేంద్రానికి వ్రాస్తుంది" అని ఆంధ్రప్రదేశ్ భవనాల శాఖ మంత్రి శ్రీ ముంగముల నరసింగరావు చెప్పారు.

శ్రీ నరసింగరావు ఇలా తెలియజేశారు: "భద్రాచలం వద్దనే ఒకచోట వంతెన కట్టడానికి సిఫార్సు వచ్చింది. ఒకరకమైన వంతెన అయితే ... లక్షలు అవుతుంది. బాగా ఎత్తుగా ఉన్నట్లు వంతెన నిర్మిస్తే ... లక్షలు, అవుతుందని అంచనా వేశారు. వంతెన ఏవిధంగా ఉండాలనేది ప్రభుత్వం నిర్ణయించి కేంద్రానికి వ్రాస్తుంది."

### మానేరుపై వంతెన

వెంకటాపురం దగ్గర మానేరుపై ద్వితీయ ప్రణాళికలో కట్టవలసిన వంతెన ఎట్లా కట్టవలసినదీ, గోదావరి ప్రాజక్టు స్థలనిర్ణయం కోసం ఆగి ఉన్నది. త్వరలో మానేరుపై వంతెన కట్టాలని అనుకొంటున్నాము" అని మంత్రి చెప్పారు.

మధ్యంలో మాదేవపురం, ములుగు, ఏటూరునాగారం, నాగరములకు రోడ్డు వేయబడుతుందని అన్నారు.

కృష్ణానదిపై విజయవాడ దగ్గర కడుతున్న వంతెన డిసెంబరు ఆఖరుకు, నాగార్జున సాగర్ వద్ద కడుతున్న వంతెన అక్టోబరు నాటికి పూర్తి అవుతాయని, రంగాపురం వద్ద కృష్ణపై వంతెన నిర్మాణానికి చెందిన పరిశీలన, ... ఉన్న ప్రభుత్వ ... పూర్తి అయి పని ప్రారంభం కాగలదని ఆశిస్తున్నానని శ్రీ నరసింగరావు చెప్పారు.

## ఉద్యోగులు - ఉద్యోగాలు

హైదరాబాదు, జూలై 8: నాయుడుపేటలోని అదనపు సహాయ సెటిల్మెంటు ఆఫీసరు ఉద్యోగం జూన్ 30 నుంచి రద్దుచేయబడింది. అక్కడ ఆ ఉద్యోగంలో ఉన్న శ్రీ కె. హనుమంతరావు నెల్లూరులో శ్రీ సి. కోటయ్యచౌదరి స్థానే అదనపు సహాయ సెటిల్మెంటు ఆఫీసరుగా పని చేస్తారు.

శ్రీ సి. కోటయ్యచౌదరి చిత్తూరులో శ్రీ కె. జోగారావు స్థానే అదనపు సహాయ సెటిల్మెంటు ఆఫీసరుగా పని చేస్తారు.

తిరుత్తనిలోని అదనపు సహాయ సెటిల్మెంటు ఆఫీసరు ఉద్యోగం 30 నుంచి రద్దుచేయబడింది. అక్కడి ఆ ఉద్యోగంలో ఉన్న శ్రీ ఎం. సాదుల్లాఖాన్ చిత్తూరులో శ్రీ ఎం. వెంకటేశ్వరరావు స్థానే సహాయ సెటిల్మెంటు ఆఫీసరుగా పనిచేస్తారు.

శ్రీ కె. జోగారావు, శ్రీ ఎం. వెంకటేశ్వరరావుల నియామకాల విషయమై విడిగా ఉత్తర్వులు జారీఅవుతాయి.

హైదరాబాదులోని ఉస్మానియా ఆస్పత్రిలోని అసిస్టెంటు సర్జన్ డా. పి. చంద్రశేఖరరెడ్డికి జూన్ 17 నుంచి 30 రోజులు జీతంమీద సెలవు మంజూరైంది. ఈ సెలవు 1952 కొత్త సెలవు నిబంధనల ప్రకారం ఆయన స్థానంలో మరొకరిని నియమించకుండా ఇచ్చారు.

విజయవాడ ప్రభుత్వ ఆస్పత్రిలో విజయ డ్యూటీలో తాత్కాలిక అసిస్టెంటుసర్జన్‌గా వున్న డా. బి. ముకుందయ్య, చిత్తూరులోని ప్రభుత్వ హెడ్ క్వార్టర్సు ఆస్పత్రిలో డా. జి. లక్ష్మణాచార్ స్థానే అసిస్టెంటు సర్జన్‌గా నియమితులైనారు.

డా. జి. లక్ష్మణాచార్, అజీ ఆస్పత్రి క్షయచికిత్సాలయంలో అసిస్టెంటు సర్జన్‌గా నియమితులైనారు.

విజయవాడ ప్రభుత్వ ఆస్పత్రిలో విజయ డ్యూటీలో తాత్కాలిక అసిస్టెంటు సర్జన్‌గా ఉన్న డా. బాబూ రాజ్ గోపాల్, కడప ప్రభుత్వ ఆస్పత్రిలోని ఒక ఖాళీలో అసిస్టెంటు సర్జన్‌గా నియమితులైనారు.

శ్రీ టి. వి. వీరరాఘవులుచెట్టి శ్రీ వి. శ్రీరంగమూర్తి స్థానే గుంటూరు జిల్లా, తూర్పు తెనాలిలో వాణిజ్యపు పన్ను ఉద్యోగిగా మళ్లీ నియమితులైనారు. శ్రీ వి. శ్రీరంగమూర్తి సామర్లకోటలో ప్రత్యేకంగా వాణిజ్యపు పన్ను ఆఫీసర్ (పన్ను ఎగవేత విచారణ) గా నియమితులైనారు.

ఆసిఫాబాదులో డిప్యూటీ కలక్టరుగా ఉన్న శ్రీ అక్బర్ అలీఖాన్ అనంతపురంజిల్లా భైరవానితిప్ప ప్రాజెక్టు స్పెషల్ డిప్యూటీ కలక్టరుగా శ్రీ జి. లక్ష్మణస్వామి స్థానే పనిచేస్తారు.

శ్రీ జి. లక్ష్మణస్వామి కృష్ణాజిల్లా నూజివీడులో బదిలీఅయిన శ్రీ ఎస్. సుబ్బారావు స్థానంలో సాధారణ విధులను నిర్వర్తిస్తారు.

డిప్యూటీ కలక్టరు శ్రీ కె. ఎఫ్. వి. అన్సారీ శ్రీ ఎం. వి. సుబ్బారావు స్థానే స్పెషల్ డిప్యూటీ కలక్టరుగా పనిచేస్తారు. ఆయన శ్రీకాకుళంజిల్లాలో ఖనిజాల దొంగరవాణాను నిరోధించే పని చూస్తారు. ఆయన ముఖ్య కార్యాలయం చీపురుపల్లిలో ఉంటుంది.

సెవ్వపల్లి డిప్యూటీ కలక్టరు శ్రీ ఎం. బి. బాలరాజ్ నెల్లూరుజిల్లాలో ఖనిజాల దొంగరవాణాను నిరోధించుటకై గూడూరు ముఖ్య కార్యాలయంగా శ్రీ ఎస్. దొరైస్వామిరెడ్డి స్థానే స్పెషల్ డిప్యూటీ కలక్టరుగా పని చేస్తారు.

శ్రీ ఎస్. దొరైస్వామిరెడ్డి కర్నూలుజిల్లా మార్కాపురంలో రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు శ్రీ ఎస్. ముత్తుకృష్ణయ్య స్థానంలో పనిచేస్తారు.

శ్రీ ఎస్. ముత్తుకృష్ణయ్య తిరుత్తనిలో శ్రీ పి. మల్లిఖార్జునం స్థానే ఎస్టేటు మేనేజర్‌గా పనిచేస్తారు.

ఒంగోలులో అదనపు సహాయ సెటిల్మెంటు ఆఫీసర్‌గా ఉన్న శ్రీ ఎస్. రాఘవపాత్రి విశాఖపట్నంజిల్లా కలక్టరుకి పెర్సనల్ అసిస్టెంటుగా పనిచేస్తారు. ప్రస్తుతం ఆ ఉద్యోగంలో వున్న శ్రీ వి. వెంకటరత్నం జూలై 1 న రిటైరు అవుతారు.

చిత్తూరులో అదనపు సహాయ సెటిల్మెంటు ఆఫీసరుగా ఉన్న శ్రీ కె. జోగన్‌రావు పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరులో శ్రీ వై. వి. చలపతిరావు స్థానంలో పనిచేస్తారు.

కొవ్వూరులోని రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్ శ్రీ వై. వి. చలపతిరావు తూర్పు గోదావరిజిల్లా కాకినాడలో సెలవుమీద వెళుతున్న శ్రీ కె. ఆర్. శ్రీనివాసన్ స్థానంలో నియమితులైనారు.

చిత్తూరులో అసిస్టెంటు సెటిల్మెంటు ఆఫీసరుగావున్న శ్రీ ఎం. వెంకటేశ్వరరావు తూర్పు గోదావరి జిల్లా కలక్టరుకి పెర్సనల్ అసిస్టెంటుగా పనిచేస్తారు. ప్రస్తుతపు ఆ ఉద్యోగంలో ఉన్న శ్రీ పి. సత్యనారాయణ బదిలీ అయినారు.

పూర్వం నరసాపురంలో రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్‌గా ఉన్న శ్రీ బి. వి. రమణమూర్తి కాళహస్తిలో శ్రీ ఎన్. సుదర్శనరావు స్థానే ఎస్టేటు మేనేజరుగా పనిచేస్తారు.

శ్రీ సుదర్శనరావు శ్రీకాకుళంజిల్లా కలక్టరుకి శ్రీ ఎం. మధుసూదనరావుస్థానే పెర్సనల్ అసిస్టెంటుగా పనిచేస్తారు.

గుడివాడలో రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుగా ఉన్న శ్రీ ఎం. మధుసూదన రావు నెల్లూరుజిల్లా కలక్టరుకి శ్రీ డి. కోటేశ్వరరావుస్థానే పెర్సనల్ అసిస్టెంటుగా పనిచేస్తారు.

శ్రీ డి. కోటేశ్వరరావు కడపలో సెలవు మీద వెళుతున్న శ్రీ ఎస్. వెంకటచలపతి నాయుడుస్థానే ట్రెజరీ డిప్యూటీ కలక్టరుగా పనిచేస్తారు.

విశాఖపట్నం సర్కిల్‌లో అమ్మకం పన్ను అధికారి (తరగతి-1 జూనియర్ స్కేల్)గా వున్న శ్రీ ఎస్. శంకరన్‌కి 47 రోజులు జీతంమీద సెలవుఇచ్చారు.

అనకాపల్లి చెఱకు పరిశోధనకేంద్రం అసిస్టెంటు కెమిస్టు శ్రీ జబ్ల్యు. తిరుమల రావుకి 62 రోజులు జీతంమీద సెలవు యివ్వబడింది.

శ్రీ జి. ఎస్. రెడ్డి సెలవునుంచి వచ్చిన తరువాత హైదరాబాదు సిటీ పోలీసు సి. ఐ. డి. స్పెషల్ బ్రాంచి అసిస్టెంటు కమీషనరుగా శ్రీ ఎస్. కృష్ణకుమార్ స్థానంలో పనిచేస్తారు.

శ్రీ ఎస్. కృష్ణకుమార్ డివిజన్ I లో శ్రీ దేవసింగ్ స్థానంలో అసిస్టెంటు కమీషనరుగా పనిచేస్తారు.

శ్రీ దేవసింగ్ మహబూబునగరంలో శ్రీ ఎం. ఏ. నవ్వుల్లాఖాన్ స్థానంలో పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటుగా పనిచేస్తారు.

ప్రభుత్వ ఆర్థికశాఖ తాత్కాలిక సహాయ కార్యదర్శి శ్రీ కె. ఎస్. భగవానులుకి 27-6-57 నుంచి 60 రోజులు సెలవు మంజూరైంది.

ప్రభుత్వ ఆర్థికశాఖ సహాయ కార్యదర్శి శ్రీ కె. కరీముల్లా సెలవు నుంచి తిరిగి వచ్చిన తరువాత జూలై 1 నుంచి ఆ శాఖలో సహాయ కార్యదర్శిగా పని చేస్తారు.

నగరపాలక సంస్థ ఇంజనీరు (మెకానికల్) శ్రీ ని. రవ్వ విద్యుత్ ... అదనపు చీఫ్ ఇంజనీరుగా పనిచేస్తారు.

# ప్రాథమిక ఉపాధ్యాయుల కడగండ్ల వారం

## ఆగస్టు 25 నుంచి 31 వరకు

హైదరాబాదు, జూలై 9: ప్రభుత్వం యీలోపుగా తమ జీతాలు పెంచకపోయినట్లయితే, ఆగస్టు 25 నుంచి 31 వరకూ, 'కడగండ్లవారం' జరపాలని, ఆంధ్రప్రదేశ్ ప్రాథమికోపాధ్యాయ సమాఖ్య నిన్న నాంపల్లిలో జరిగిన సర్వసభ్య సమావేశంలో తీర్మానించుకొన్నది.

సమాఖ్య అధ్యక్షుడు శ్రీ చెన్నకంటి లక్ష్మయ్య అధ్యక్షతన, వైశ్య హాస్టలులో యీ సమావేశం జరిగింది. రాష్ట్రంలో వివిధ ప్రాంతాలనుండి 75 మంది ప్రతినిధులు హాజరైనారు.

ఒక్కొక్క ఉపాధ్యాయునికి విద్యార్థుల సంఖ్య సగటున కనీసపు హాజరు 30 కి తగ్గించాలని యీ సమావేశంలో ప్రభుత్వాన్ని అర్థించారు.

తెనాలి, కైకలూరు సమావేశాలలో, విద్యామంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు ఉపాధ్యాయులను గురించి వెల్లడించిన అభిప్రాయాలు ఉపాధ్యాయులందరికీ బాధ కలిగించాయని యీ సమావేశంలో తీర్మానించారు.

## విశాఖ - హైదరాబాదుల మధ్య సరాసరి రైళ్లు

### విజయనగరం వాణిజ్యమండలి వినతి

విజయనగరం, జూలై 8: ఆంధ్రప్రదేశ్‌లోని ఉత్తరజిల్లాల ప్రజల ఇబ్బందిని తొలగించటానికి విశాఖపట్టణంనుంచి హైదరాబాదు, బొంబాయి నగరాలకు సరాసరి రైళ్లు వేయటం అవసరమని పట్టణ వాణిజ్యమండలి ప్రతినిధి వర్గం ఆగ్నేయ రైలుమార్గం వినియోగదారుల సలహాసంఘానికి విజ్ఞప్తిచేసింది.

ఆగ్నేయ రైలుమార్గంలో ప్రయాణీకులకు వసతులనుపరిశీలించటానికిపర్యటిస్తూ సలహాసంఘం ఇక్కడికివచ్చింది. ఈ పట్టణంలో రైల్వేసమాచార కార్యాలయాన్నీ, అదనంగా ఇంకొక టిక్కెట్లుఇచ్చే కార్యాలయాన్నీ ఏర్పాటు చెయ్యాలనీ, సరుకులు తూకంతూచే కాటా ఒకటి నెలకొల్పాలనీ వాణిజ్య మండలి, సలహాసంఘానికి మనవిచేసింది. మండలి సమర్పించిన వినతి పత్రాన్ని సలహా సంఘం తరఫున శ్రీ పి. వెంకట్రావు తీసుకున్నారు.

జిల్లాల స్థాయిలోకూడా రైల్వే వినియోగదారుల సలహా సంఘాలను నెలకొల్పినట్లయితే స్థానికంగా ఉండే సమస్యలను పరిష్కరించటం తేలికగా ఉంటుందనీ, ఈ విషయమై అధికారులకు తగిన సిఫార్సు చేయవలసిందనీ మండలి సలహా సంఘానికి సూచించింది.

వాణిజ్యమండలి ప్రతినిధివర్గంలో శ్రీయుతులు ఎన్. విశ్వనాథన్ (అధ్యక్షుడు), వి. శ్రీరామమూర్తి (కార్యదర్శి), ఎ. సూర్యనారాయణమూర్తి (సంయుక్త కార్యదర్శి) ఉన్నారు.

సలహాసంఘం నిన్న ఇక్కడనుంచి విశాఖపట్టణం వెళ్లింది. (స్వ. వి.)

## శ్రీ రఘురామయ్య ఢిల్లీ ప్రయాణం

హైదరాబాదు, జూలై 9: భారత ప్రభుత్వ రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్యమూడురోజులుగా యిక్కడి రక్షణ కార్యాలయాల్లోని వివిధ శాఖలను చూసి ఉదయం విమానంలో ఢిల్లీ వెళ్ళారు.

కాంటోన్మెంటు బోర్డు నిర్వాహకులు నిన్న ఉపమంత్రి నిదర్శించి తమకు ఎక్కువ అధికారాలు కావాలని విన్నవించారు.

## తెలంగాణాలో కోర్టు రుసుం హెచ్చింపు

### హైదరాబాదు చట్టాన్ని సవరిస్తూ బిల్లు

హైదరాబాదు, జూలై 9: రిట్ దరఖాస్తులు దాఖలుచేసేందుకు హైకోర్టుకు చెల్లించవలసిన రుసుం ఆంధ్ర-తెలంగాణాప్రాంతాలలో ఒకే విధంగా ఉండేట్లు చేయడానికి, 1324 ఫసలీ హైదరాబాదు కోర్టు రుసుములచట్టాన్ని సవరిస్తూ, ప్రభుత్వం శాసనసభలో ప్రతిపాదించదలచిన బిల్లు ప్రకటించింది. దీనిని 1957 హైదరాబాదుకోర్టు రుసుం ఆంధ్రప్రదేశ్ సవరణ-చట్టం అని వ్యవహరిస్తారు.

కోర్టు రుసుం విషయంలో హైకోర్టు వ్యవహారాలకు సంబంధించినంతమటుకు తెలంగాణా ప్రాంతంలో అమలుజరుగుతున్న చట్టం తెలంగాణాంప్రాంతానికి, ఆంధ్రప్రాంతంలో అమలులో ఉన్న చట్టం ఆంధ్రప్రాంతానికి వర్తిస్తుందని, యిటీవల ఒక అభియోగం సందర్భంలో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు నిర్ణయించింది. 1324 ఫసలీ హైదరాబాదు కోర్టు రుసుంచట్టంక్రింద, హైకోర్టుకు ఏ దరఖాస్తు పంపాలన్నా రు 2 రుసుం చెల్లిస్తే చాలు. కాని 1956 ఆంధ్ర కోర్టురుసుం, దావాల కిమ్మతు చట్టంప్రకారం, రాజ్యాంగంలో 226 వ విభాగం క్రింద హైకోర్టులో రిట్ (హెబియస్ కార్పస్ కానిది) దాఖలు చేయడానికి రు 100 లు కోర్టు రుసుం చెల్లించాలి. హైకోర్టులో దాఖలుచేసే దరఖాస్తులకు రుసుం చెల్లింపు ఆంధ్రప్రదేశ్ అంతటా ఒక పద్ధతిన లేదు. హైదరాబాదు చట్టాన్ని సవరించి, యీ రుసుము ఒకే పద్ధతిలో ఉండేట్లు చేయడానికి యీ బిల్లును ప్రభుత్వం సంకల్పించింది.

## ఎన్. జి. ఓల మౌన ప్రదర్శన

### ముఖ్యమంత్రి మౌనావలోకనం

హైదరాబాదు, జూలై 9: ఆంధ్రప్రాంతంలోని నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు దాదాపు వెయ్యిమంది నిన్న సాయంత్రం శాసనసభాభవనం వద్దకువచ్చి మౌనంగా ప్రదర్శన చేశారు. తమ జీతాలుచాలక దుర్భరస్థితిలో ఉన్నట్లు తెలిపే చిన్న అట్టముక్కలు (బాడ్జీలు) ధరించారు.

ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి,వారిని చూచి మౌనంగా వెళ్ళిపోయారు.

## ప్రాథమిక వస్తువుల అధిక ధరలు

### సూయజ్‌పై బ్రిటిష్ ఫ్రాన్సుల దుశ్చర్యఫలితం

జనీవా, జూలై 9: సూయజ్ పై బ్రిటన్, ఫ్రాన్సుల దురాక్రమణ చర్య ఫలితంగా ప్రపంచంలోని ప్రాథమిక అవసరవస్తువులధరలు నూటికి 7 నుండి 8 వంతులు అధికమయ్యాయనీ, గత డిసెంబరులో ఈధరలు మరీహెచ్చాయనీ కాని ఈకాలువను తెరచిన ఏప్రిల్ నుండి తిరిగి ఈధరలు మామూలు స్థితికి వచ్చాయనీ సమితి ఆర్థిక, సాంఘిక వ్యవహార మండలిలో ఈజిప్టు ప్రతినిధి శ్రీ ఎల్. అతాఫీ అన్నారు. తమ నిర్వాకాన్నిటనీ బ్రిటన్, అమెరికాలు స్తంభింపచేసినా, నూతన పరిస్థితులకు తగిన రీతిని ఈజిప్టు ఆర్థిక పరిస్థితి పెంపొందిందనీ, కువిపత్కర సమయంలో కూడా ఆర్థికరంగం వివిధశాఖలలోనూ జాతీయోత్పత్తి అధికమైందనీ అన్నారు. ఈజిప్టులో విదేశాల పెట్టుబడికి ఎంతో అవకాశం ఉందన్నారు.

# భీమవరంలో శీతజ్వరం

## కొత్త ప్రాంతాలకు కూడా వ్యాపిస్తోంది

భీమవరం, జూలై 9: భీమవరం ప్రాంతంలో శీతజ్వరం ప్రారంభమై మూడువారాలు అవుతున్నా ఇంతవరకూ తగ్గలేదు. ఉండి, ఆకివీడు, బాండాం, పెరవానరం ఫిర్కాలలోని కొన్ని గ్రామాలలో కొత్తగా ఈ వ్యాధి ప్రారంభమైందని వార్తలు వస్తున్నవి.

ఈ తాలూకాలోని గ్రామాలలో ఏనాటిక నాటికి 30 మందికి ఈ వ్యాధి వచ్చింది. ఈ పట్టణం మొత్తం జనాభా 40 వేలు; ఇందులో దాదాపు నాలుగయిదు వేలమందికి శీతజ్వరం తగిలిందని అంచనా. వ్యాధి నిరోధానికి అవసరమైన కట్టుదిట్టాలు చేస్తున్నా శీతజ్వరం తగ్గడం లేదు. ప్రాథమిక పాఠశాలలను మూసివేశారు. స్పష్టమైన ఉత్తరువు ఏమీ లేకుండానే ఉన్నత పాఠశాలలూ, కళాశాలా మాత్రం పనిచేస్తూనే ఉన్నవి.

ప్రజల అవస్థలు ఇట్లా ఉండగా శీతజ్వరం చికిత్సకు పనికివచ్చే మందులను వర్తకులు చాలాఎక్కువ ధరలకు అమ్ముతున్నారట.

## సహాయం ఇవ్వకపోతే రాజీనామాలు

### తెనాలితాలూకా గ్రామోద్యోగుల నిర్ణయం

తెనాలి, జూలై 9: తాత్కాలిక సహాయమైనా ఈ నెలాఖరులోగా ప్రభుత్వం ఇవ్వకపోతే రాజీనామాలను కార్యదర్శికి అందచేయాలని తెనాలి తాలూకా గ్రామోద్యోగుల సంఘ అవసర సమావేశంలో తీర్మానించారు. శ్రీ ఆవుల వెంకటరత్నం చౌదరి అధ్యక్షత వహించారు. సమావేశానికి దాదాపు 130 మంది గ్రామోద్యోగులు వచ్చారు.

నెల్లూరులో ఇటీవల జరిగిన సభలో రాష్ట్రసంఘం చేసిన తీర్మానాలను శ్రీయుతులు కె. కృష్ణమూర్తి, సి. ప్రకాశరావు, వి. ఉచ్చిరాజు, మూల్పూరు రంగయ్యగారలు వివరించారు.

శ్రీ ప్రకాశం పంతులుగారి మృతికి సంతాపం ప్రకటించారు.

లెఖ్ఖలు తయారుచేసేందుకు ప్రభుత్వం తగినంత వ్యవధి ఇవ్వలేదు కనుక జమాబందిపనిలోను, కిస్తీవసూలు పనిలోనూ పాల్గొనరాదని రాష్ట్ర సంఘం చేసిన తీర్మానాన్ని ఈ సమావేశం బలపరిచింది.

సంఘ కార్యక్రమాన్ని ఆచరణలోకి తెచ్చేందుకూ, ఎదురొక్కవలసిన సమస్యలను పరిశీలించేందుకూ శ్రీయుతులు పి. హనుమంతరావు, డి. వి. బలరామయ్య, పి. ఎస్. ప్రకాశరావు, డి. రాజగోపాలరావు, కె. హనుమంతరావు, జి. హనుమంతరావు, కె. సుబ్రహ్మణ్యం, ఎన్. వెంకటరామయ్య, కె. సూర్యప్రకాశరావు, పి. శ్రీరామమూర్తి, ఎమ్. సీతారామయ్య, కె. వెంకటేశ్వరరావు, టి బసవపున్నయ్య, టి. సత్యనారాయణగారలు సభ్యులుగా ఒక సంఘాన్ని ఏర్పాటుచేశారు. శ్రీ పి. కృష్ణమూర్తి వందన సమర్పణ చేశారు.

## జయప్రకాశ్, లోహియాల సమావేశం

### ప్రతిపక్ష నిర్మాణంపై చర్చలు సంభవం

లక్నో, జూలై 9: శ్రీ జయప్రకాశ్ నారాయణ్, డా॥ రామమనోహర్ లోహియా, వచ్చేవారంయిక్కడగానీ, లేకపోతే ఆ తరువాత కలకత్తాలోగానీ, కలుసుకుంటారని తెలుస్తున్నది. నాయకులిద్దరు తమ తమ అభిప్రాయాలను వెల్లడి చేసుకుంటారు.

ఈ విషయమై ఉభయులమధ్య, కొంతకాలంగా ఉత్తర ప్రత్యుత్తరాలు నడుస్తున్నాయి.

కమ్యూనిస్టుపార్టీ తల ఎత్తకుండా, ప్రజాస్వామిక పద్ధతులలో ఒక ప్రతిపక్షం రూపొందాలంటే, ప్రజా సోషలిస్టు, సోషలిస్టుపార్టీలు మరింత సన్నిహితం కావటం అవసరమని శ్రీ జయప్రకాశ్, డాక్టర్ లోహియా, భావిస్తున్నారు.

ఈ సమావేశం ఏర్పాటు అవుతున్నందువల్ల ప్రజా సోషలిస్టు పక్షంతో డా॥ లోహియాకుగల విభేదాలు సమసిపోయినట్లు అనుకోరాదనీ, ప్రస్తుతమైన వైమనస్యం కొంతవరకు ఉపశమించి ఉభయ పక్షాలమధ్య సామరస్యం పెంపొందడానికి యీ చర్చలు ఉపకరించవచ్చునని యీ వర్గాలు తెలుపుతున్నారు.

# కైరోకు నెహ్రూ ప్రయాణం

## నాసర్‌తో ముఖ్య చర్చల ఏర్పాటు

వాషింగ్టన్, జూలై 10: రెండు రోజుల హాలండ్ సందర్శనం అనంతరం, భారత ప్రధానమంత్రి శ్రీ జవహర్లాల్ నెహ్రూ ఇవాళ ఉదయం, భారత వైమానిక దళానికి చెందిన ఒక విమానంలో ఈజిప్టుకు బయలుదేరి వెళ్ళారు.

శ్రీ నెహ్రూ, బ్రిండిసీ (ఇటలీ) మీదుగా కైరోనగరం వెడుతున్నారు. ఈజిప్టులో శ్రీ నాసర్ అధికారంలోకివచ్చాక, శ్రీ నెహ్రూ కైరో నగరం వెళ్లడం ఇది అయిదవసారి.

శ్రీ నెహ్రూ లండన్‌లో బ్రిటిష్ ప్రధాని శ్రీ మాక్మిలన్‌తో అంతర్జాతీయ సమస్యలపై అంతరంగిక సమాలోచనలు జరిపిఉన్నారు. కామన్వెల్త్ ప్రధానుల సమావేశంలో పశ్చిమాసియా సమస్యలపై చర్చలు జరిగాయి.

అందువల్ల ఇప్పుడు కైరోలో నెహ్రూ నాసర్‌ల చర్చలకు ప్రాధాన్యం ఉంటుంది.

బ్రిటన్ ఈజిప్టుల మధ్య తిరిగి సఖ్యత చేకూర్చడానికి శ్రీ నెహ్రూ కృషి చెయ్యగలరని ఇటీవల ఈజిప్టు పత్రికలు ఆశ ప్రకటించాయి. అయితే శ్రీ నెహ్రూ మధ్యవర్తిత్వం వహించగలరనడానికి ఆధారాలు కనపడ్డంలేదు.

### ఈజిప్టులో నెహ్రూపట్ల అభిమానం

సూయజ్ కాలువ కంపెనీని జాతీయం చేసినప్పుడు, ఇజ్రేల్, బ్రిటన్, ఫ్రాన్సులు దాడిచేసినప్పుడు, సమితిలోనూ ఇతరత్రానూ ఈజిప్టు తరఫున భారతదేశం నిలిచి వాదించినందుకు, భారతీయులపట్ల, ముఖ్యంగా శ్రీ నెహ్రూపట్ల ఈజిప్టులో ప్రజలకు అపార ప్రేమాభిమానాలున్నాయి. ఈజిప్టు భారతదేశాల మధ్య మైత్రి మరింత గాఢమయింది.

### కైరోలో కార్యక్రమం

కైరో, జూలై 10: భారత ప్రధాని శ్రీ నెహ్రూ ఇవాళ సాయంకాలం ఏడుంబావుకు కైరో చేరుకుంటారు. అధ్యక్షుడు శ్రీ నాసర్ స్వయంగా విమానాశ్రయానికివచ్చి, శ్రీనెహ్రూను స్వాగతమిస్తారు.

శ్రీ నెహ్రూ కైరోలో మూడు రాత్రులు, ఒక పగలు గడుపుతారు; ఒకరోజు ఉదయం సూడాన్ రాజధాని ఖార్టూమ్‌వెళ్ళి, రాత్రికి కైరో తిరిగి వస్తారు.

ఇవాళ రాత్రిభారత రాయబారి భవనంలో విశ్రాంతి తీసుకుంటారు.

రేపు ఉదయం 11 గంటల 15 నిమిషాలకు కైరోకు నాలుగు మైళ్లలో ఉన్న నాసర్ నివాస భవనంలో శ్రీ నాసర్‌తో చర్చలు ప్రారంభమౌతాయి. రేపు రోజంతా చర్చలు సాగవచ్చు.

## మీనన్ లాయిడ్ సంప్రదింపులు

లండన్, జూలై 9: రక్షణ మంత్రి శ్రీ వి. కె. కృష్ణమీనన్, యివాళ బ్రిటిష్ విదేశాంగమంత్రి శ్రీ సెల్విన్ లాయిడ్‌తో విందారగించారు.

కామన్వెల్తు ప్రధానమంత్రుల సమావేశంలో పాల్గొనేందుకు గాను వీరు రెండు వారాల క్రిందట శ్రీ నెహ్రూతో యిక్కడికి వచ్చారు.

శ్రీ మీనన్ యివాళ మళ్లీ విదేశాంగ కార్యాలయానికివెళ్లి శ్రీ లాయిడ్‌తో చర్చలు జరిపారు.

## బొంబాయి మార్కెట్

బొంబాయి, జూలై 10:

| | |
|---|---|
| వెండి | 179-2-0 |
| బంగారం | 105-7-0 |
| నవరకు | 70-2-0 |

నిత్తుల మార్కెట్ మూసివేశారు.

# పాశ్చాత్య రాజ్యాల స్థాయికి రావాలి

## ప్రణాళికల తగ్గింపు తగదని రఘురామయ్య హితవు

హైదరాబాదు, జూలై 9: "ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఇప్పుడు ఉన్నంతా ఉండాల్సిందే; తగ్గించడానికి వీలు లేదు. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల స్థాయిని అందుకోవాలంటే, మన దేశం శరవేగంతో పురోగమించాలి; అందుకే ప్రణాళికలో పరిశ్రమలకు ప్రత్యేక ప్రాధాన్యం ఇచ్చారు" అని భారత రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య అన్నారు. ఈ సాయంత్రం యిక్కడ తన గౌరవార్థం యేర్పాటు చేసిన సన్మాన సభలో శ్రీ రఘురామయ్య ప్రసంగిస్తూ ఇలా అన్నారు.

"మనకు లభించగల ఆదాయాధారాలను మించి ఉందికనుక ప్రణాళికను కుదించివేయాలని కొందరంటున్నారు. ఇది సమర్థనీయం గాదు. కడచిన 200 సం॥ పారతంత్ర్యం వల్ల పారిశ్రామికంగా భారతదేశం యెంచుమించు నిలిచి పోయింది. పాశ్చాత్య రాజ్యాలు అతివేగంగా అభివృద్ధి చెందాయి. పాశ్చాత్య దేశాలు అణుశక్తిని అనేక విధాలుగా ఉపయోగించుకోవాలని ప్రయత్నిస్తుంటే, భారతదేశం యీ స్తబ్ధత వల్ల, యింకా "ఆవిరి ఇంజను" యుగంలోనే ఉంది. పాశ్చాత్య రాజ్యాల స్థాయి అందుకోవాలి; వాటితో పాటు భారతదేశం కూడా అగ్రగామియై నడవాలి"

ఈ సభకు రాష్ట్ర ప్రణాళికా మంత్రి శ్రీ వి. బి. రాజు అధ్యక్షత వహించారు.

# జంటనగరాల్లో విద్యాలయాలు

## మొన్నటినుంచి ప్రారంభం

హైదరాబాదు, జూలై 8: హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో, పాఠశాలలు, కళాశాలలు శీతజ్వర స్థితి కొంత మెరుగైనందున, యీ వాళ నుంచి తెరచారు.

నగరంలో క్రితంవారం రోజూ సగటున 200 మందికి శీతజ్వరం తగులుతూ ఉండేది. ఇప్పుడా సంఖ్య 900 కు తగ్గినట్లు తెలిసింది.

వివిధ ఆసుపత్రులలోను ఇవాళ 60 మంది జ్వరం తగిలినవారిని చేర్చారు. 127 మందికి మందులిచ్చి పంపారు. 188 మందికి సంచారదళాలవారు ఇంటికి వెళ్ళి వైద్యం చేశారు. 525 మంది ప్రైవేటు వైద్యుల వద్ద చికిత్స పొందారు.

# సభాపతి జీతంలో రు 100 త్యాగం

## పొదుపు ఉద్యమానికి ఐచ్ఛిక సహాయం

హైదరాబాదు, జూలై 8: ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ, సభాపతి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, తమ సెలజీతం ఐచ్ఛికంగా రు 100 తగ్గించుకొన్నారు. ప్రధానమంత్రి ప్రారంభించిన పొదుపు ఉద్యమానికి యథాశక్తి సహాయపడాలనే శ్రీ కాళేశ్వరరావు యీ త్యాగం చేశారు.

# మండ్లెంలో హత్య

నందికొట్కూరు, జూలై 8: ఇక్కడికి 4 మైళ్ళలో మండ్లెం గ్రామంలో ఈ నెల 6న మర్తుజాసాహెబ్ ను ఎవరో చంపి మండ్లెం, తర్తూరు గ్రామాల మధ్యలోని బావిలో పడవేశారు. కాళ్ళు, చేతులను, శరీరానికి తాళ్ళతో బిగించి బావిలో పడవేశారు. శరీరం నిండా రక్తం కారుతున్న దెబ్బలు అగుపించినవి. నందికొట్కూరు పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు. (స్వ.వి.)

# మదరాసు వార్తలు

మదరాసు, జూలై 9: నీటిపారుదల శాఖ ఉపకార్యదర్శి శ్రీ టి. వి. నటేశ మొదలియార్ ను మదరాసు రాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలి కార్యదర్శిగా నియమించారు.

* * *

నిన్న రాత్రి 9-30 వరకు 24 మంది కలరా రోగులను అంటువ్యాధుల ఆస్పత్రిలో చేర్చారు. ఒక ఆడమనిషి చనిపోయింది.

* * *

విక్రయం పన్ను చట్టమును సవరించే సందర్భమున ప్రత్యేకోద్యోగి లోగనాథన్ జారీచేసిన ప్రశ్నావళికి సమాధానం పంపే గడువును పెంచటానికి నిశ్చయించారు.

* * *

రాష్ట్రంలో పరిశ్రమలను వృద్ధి చేయటానికి అవసరమైన భోగట్టాను సేకరించి ఏ ఏ పరిశ్రమలను ఏ ఏ రంగంలో స్థాపించవచ్చునో ప్రభుత్వానికి సలహా ఇచ్చేందుకు ప్రభుత్వం పరిశ్రమల మంత్రి అధ్యక్షత క్రింద ఒక సంఘాన్ని నియమించింది. ఈ సంఘానికి పరిశ్రమల డైరక్టరు కార్యదర్శిగా వుంటారు. ఈ సంఘంలో సభ్యులుగా వుండవలసిందని ప్రభుత్వం శ్రీ వి. రామకృష్ణను కోరింది.

* * *

నగరాభివృద్ధి మండలి అధ్యక్షుడు శ్రీ డి. జ్ఞానవోలు అమెరికాలో పర్యటించి నిన్న ఉదయం తిరిగి వచ్చారు.

భారత రక్షణమంత్రి శ్రీ వి. కె. కృష్ణమీనన్ (ఎడమవైపువారు) ఇటీవల పెంటగన్ కార్యాలయంవద్ద అమెరికా రక్షణ కార్యదర్శి శ్రీ ఛార్లెస్ ఇ. విల్సన్‌ను కలుసుకున్నారు.

ఇటీవల భారత ప్రధాని శ్రీ నెహ్రూ నార్వే వెళ్ళినప్పుడు, ఆ దేశపు ప్రభుత్వం చేసిన విందులో: ఐక్యరాజ్య సమితి మాజీ కార్యదర్శి శ్రీ ట్రిగ్వేలీ, శ్రీమతి లీ, శ్రీ నెహ్రూ.

కేంద్ర ఆరోగ్యమంత్రి శ్రీ డి. పి. కర్మార్కర్ రాష్ట్ర ఆహారమంత్రులకు న్యూఢిల్లీ ఇటీవల సత్కారవిందు చేశారు. రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ ప్రపంచ ఆరోగ్యసంస్థ తొలూకు డా॥ మాట్రాప్ (ఎడమనుండి రెండవవారు) శ్రీమతి మాట్రాప్ లెఫ్టినెంటు జనరల్ బి. చౌదరి మాట్లాడుకుంటున్నారు.

రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య వాలికా కేంద్రాన్ని పరిశీలించేందుకు కొచ్చిన్ వచ్చారు. వి. యస్. ఎస్. గరుడకమాండోన్ ఎస్. జి. కర్మార్కర్, త్రిచూర్ జిల్లా కలెక్టరు శ్రీ కె. ఎస్. మీనన్ మంత్రికి స్వాగతం ఇస్తున్నారు.

# ముఖ్యమంత్రి ఈద్ సందేశం

హైదరాబాదు, జూలై 8: ఈద్ సందర్భంలో రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు, ముస్లింలకు ఈ అభివందన సందేశం ఇచ్చారు:

"ఈద్ ఉల్ జొహాన్ని యేకగ్రీవంగా చేసిన మహా త్యాగాన్ని సంస్మరిస్తూ చేసుకొనే ఉత్సవం, ముస్లిం అయినా ముస్లిమేతరుడు అయినా అందరిలోనూ త్యాగభావాన్ని ఉద్దీపింపచేస్తుంది. ఈ శుభసమయంలో ఆంధ్రప్రదేశ్ లో ముస్లిం సోదరులందరికీ నా హృదయ పూర్వక శుభాకాంక్షలు."

# పాలమూరు పంచాయతీ

పాలమూరు, జూలై 6: పాలమూరు గ్రామ పంచాయతీబోర్డు ప్రత్యేక సమావేశం నిన్న జరిగింది. శ్రీ కె. రామకృష్ణంరాజు అధ్యక్షత వహించారు. పంచాయతీ ఉపాధ్యక్షుడుగా శ్రీ యామిజాలసుబ్బారావు ఎన్నికయినారు.

# పాలలో నీళ్ళుకలిపిన నేరాలు

తెనుకు, జూలై 8: పాల్లో నేనాటికి 40 పాళ్ళు నీళ్ళుకలిపి అమ్మారని కె. గంగులు, ఎమ్. శాహాజీ లపై తెనుకు పారిశుధ్యశాఖ ఇన్‌స్పెక్టరు నేరాలను దాఖలుచేశారు. గంగులుకి రు 100 జరిమానా, షాజీకి రు. 200 జరిమానా కోర్టువారు ప్రథమశ్రేణి మేజస్ట్రేట్ విధించారు.

# ధరలు పెరగడం ఆంధ్ర రైతులకు లాభకరమే

## మండలాల ఏర్పాటువద్దని జైన్‌కు రైతు ప్రతినిధుల, మిల్లు యజమానులవినతి

(ఆంధ్రపత్రిక విలేఖరి)

భీమవరం, జూలై 7: వరిపంటలో మిగులు రాష్ట్రంగా వున్న ఆంధ్రను మద్రాసు మైసూరులకు మాత్రమే ముడిపెట్టి మండలం ఏర్పాటుచేసి బియ్యం రవాణాపై నిర్బంధాలు విధిస్తే ఆంధ్రలో ధరలు పడిపోయి వ్యవసాయం దెబ్బతిని ఆహారోత్పత్తి కుంటుపడగలదని ధరలు పెరగడం రైతుకు లాభమే కనుక ఇటువంటి మండలాలు ఏర్పాటుచేయవద్దని కేంద్ర ఆహార మంత్రి శ్రీ అజిత్ ప్రశాద్ జైన్‌కు పార్లమెంటు సభ్యుడు శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్య ఆంధ్ర వ్యవసాయదారుల తరఫున విజ్ఞప్తిచేశారు. ఈ మండలాల నిర్మాణం అక్టోబరు ఆఖరువరకు వాయిదా వేయాలని, అప్పటికి ఆంధ్రలో మొదటిపంట కోతకు సిద్ధంగా వుండగలదని శ్రీ కె. నాగభూషణం (బియ్యపు మిల్లుల యజమానుల సంఘాధ్యక్షుడు) సూచించారు. మండలాలను అప్పుడు ఏర్పాటుచేస్తే మద్రాసు, మైసూరు, కేరళ బెంగాలు, బొంబాయిలను, ఐదింటినీ ఆంధ్రకు కలపాలని కోరారు.

ఇటీవల శ్రీ జైన్ వద్దకు వీరందరు ఒక రాయబారంగా వెళ్ళిన సందర్భంలో యీ విజ్ఞప్తులు చేశారు.

ద్వితీయ ప్రణాళిక కాలం ప్రారంభమైనందున ఆంధ్రలో వ్యవసాయదారులు అధికోత్పత్తికి ఎంతో వుత్సాహంతో వున్నారని, 1955-56 ఆఖరునాటికి అదివరకటికంటె సుమారు 4 లక్షలటన్నుల ధాన్యం అదనంగా పండించి వున్నారని బొంబాయి, బెంగాలు, సౌరాష్ట్రలలో బాగా గిరాకీవుందని శ్రీ బలరామకృష్ణయ్య, వివరించారు. ధరల పెరుగుదలకు వ్యాగన్ల కొరత, దొంగరవాణా, అమ్మకం, కొనుగోలు పన్నుల విధింపు, వంటివి కారణాలు కావచ్చని అవి విచారించాలని సూచించారు. అయినా నరల పెరుగుదల రైతుకు బాగా లాభదాయకమే గాని ఏమాత్రం ఆందోళన చెందనవసరంలేదని, పైగా అధికోత్పత్తికి కూడా వుత్సాహపరుస్తుందని తమ అభిప్రాయం వెలిబుచ్చారు. కనుక బియ్యం రవాణాపై నిర్బంధాలు కూడదని విజ్ఞప్తిచేశారు.

ఆంధ్రలో "షెల్లర్" పద్ధతిధాన్యం మరాలు 800 "హల్లర్" పద్ధతివి 3000 కలవనీ, వీటిల్లో అధికభాగం కోస్తా జిల్లాలలోనే వున్నాయని సుమారు రు 20 కోట్ల పెట్టుబడితో ఇవి స్థాపించడం జరిగిందని, 65 వేలమంది కార్మికులున్నారని శ్రీ నాగభూషణం వివరించారు. దాళవాపంటతో సహా 8 లక్షల టన్నులవరకు ఎగుమతి చేయవచ్చని, యీ ఏడాది 2 లక్షల టన్నుల ఎగుమతి జరిగిందని ఇంకా సుమారు 6 లక్షల టన్నులు మిగలవచ్చని తెలిపారు. ఈ 6 లక్షలలో దాదాపు 3 లక్షలు ఉప్పుడు బియ్యము తతిమాది మేలురకం పచ్చిబియ్యమని, ఉప్పుడు బియ్యానికి కేరళలో బాగా గిరాకీ కలదని వివరించారు. బొంబాయి, సౌరాష్ట్రలలో ఆంధ్రలోని మేలురకం బియ్యానికి గిరాకీకలదని, కనుక బొంబాయి, బెంగాలు, కేరళలను మద్రాసు, మైసూరులతో పాటు ఆంధ్రకు కలపాలని కోరారు. ప్రస్తుతం యీ మండలాలను ఏర్పాటుచేయడం తగదని ఎగుమతులు, అమ్మకాలు, విషయమై ఒప్పందాలు జరిగిపోయాయని, కనుక అక్టోబరు ఆఖరువరకు వాయిదా వేయాలని కోరారు.

# ఎరుకల ఏనాది సుగాలీలను గిరిజనుల జాబితాలో చేర్చాలి

## గిరిజన సంక్షేమ కార్యకర్తల వినతి

హైదరాబాదు, జూలై 9: గిరిజన సంక్షేమ కార్యకర్తలు క్రింతం వారాంతాన సమావేశమై, రాష్ట్రప్రభుత్వము, గిరిజనుల జాబితాను సవరించి, ఎరుకల, యానాది, సుగాలీలను (లంబాడి) ఆ జాబితాలో చేర్చాలని కోరుతూ తీర్మానించారు.

ఈ సమావేశానికి పార్లమెంటు సభ్యుడు శ్రీ హెచ్. సి. హెడా అధ్యక్షత వహించారు. రాష్ట్రంలోని వివిధ గిరిజన సంక్షేమ సంస్థల తరఫున 50 మంది ప్రతినిధులు హాజరైనారు. ఆంధ్ర ఆదిమజాతి సేవకసంఘం కార్యకలాపాలు రాష్ట్రమంతటికి విస్తృతమయ్యేందుకు వీలుగా, ఆ సంఘాన్ని పునర్నిర్మించే విషయం ఆలోచించడానికి యీ సమావేశం యేర్పాటయింది.

రాష్ట్ర సంక్షేమశాఖ మంత్రి శ్రీ డి. సంజీవయ్య సమావేశంలో ప్రసంగిస్తూ, గిరిజనుల అభ్యున్నతికోసం అనేక సంస్థలుండే కన్నా, రాష్ట్రమంతటికీ ఒకే ఒక సంస్థ ఉండడం మంచిది అని సలహా ఇచ్చారు.

"గిరిజనప్రాంతాలలో విద్యావ్యాప్తి చాలా ప్రధానమైన విషయం. సంఘసేవకులు వెంటనే యిందుకుపూనుకోవాలి. ఇదిగాక ఆ ప్రాంతాలలో రాకపోకలసౌకర్యాల అభివృద్ధికి, ఆరోగ్య రక్షణకేంద్రాలను యేర్పాటుచేయడానికి, మంచినీటి సదుపాయాలు కల్పించడానికి సంఘసేవకులు శ్రద్ధవహించాలి" అని మంత్రి అన్నారు.

గిరిజనుల ఆర్థికపరిస్థితి బాగుచేయడానికి, అడవులనుండి వారు తెచ్చే సామగ్రి కొనేసంస్థ యేర్పాటుచేయాలని, ఇటువంటిసంస్థలు కొన్నిచోట్ల జయప్రదం గానడుస్తున్నాయని శ్రీ సంజీవయ్య చెప్పారు. గిరిజన సంక్షేమ కార్యకర్తలుగా సాధ్యమైనంతవరకు, గిరిజనుల నుండే ఎంచుకోవడం మంచిదని, అందువల్ల వారు చిత్తశుద్ధితోను, ఉత్సాహంతోను, పనిచేయవీలౌతుందని, గిరిజన సంక్షేమ కార్యకర్తలు, నెలలో ఎక్కువ రోజులు మన్య ప్రాంతాలలో గిరిజనులతోనే గడపాలని, అటువంటి సాన్నిహిత్యం ఉన్నప్పుడే పరస్పరం బాగా అర్థంచేసుకోడం జరుగుతుందని సంజీవయ్య సలహా ఇచ్చారు.

నిడుబ్రోలు, జూలై 7: మద్రాసువెళ్లే సరుకుల రైలు ఇంజను నేటి ప్రాతఃకాలం ఇక్కడ స్టేషనులో పట్టాలు తప్పింది. నష్టం వివరాలు తెలియలేదు.

# వనమహోత్సవాలు

## జగ్గయ్యపేట

శ్రీ గొనుగుంట్ల నాగేశ్వరరావు తోటలో 4 వ తేదీన వనమహోత్సవం జరిగింది. గ్రామప్రముఖులు తహశీల్దారు మొదలైనవారు ఉత్సవంలో పాల్గొన్నారు.

## బేస్తవారపుపేట

గ్రామపంచాయతీ, జాతీయ విస్తరణ కేంద్రాల సంయుక్త యాజమాన్యాన 1 వ తేదీన వనమహోత్సవం జరిగింది. అభివృద్ధిశాఖోద్యోగి శ్రీ జి. వి. రాఘవయ్య అధ్యక్షత వహించారు. ఎ. వి. ఎం. ఉపాధ్యాయ శిక్షణ పాఠశాల వ్యవహర్త శ్రీ ఎఫ్. జి. క్రిజండన్ సభను ప్రారంభించారు. పంచాయతీ అధ్యక్షుడు శ్రీ ఎం. వి. సుబ్బయ్యగుప్త సాంఘికసేవా ప్రచారకుడు శ్రీ రామశాస్త్రి చెట్లను పెంచవలసిన అవసరాన్ని వివరించారు. తరువాత ఉత్సవానికి హాజరైనవారంతా కలసి 200 మొక్కలు నాటారు.

## రాయదుర్గంలో సర్వోదయ ఉత్సవం

రాయదుర్గం, జూలై 8: తాలూకా కచేరి ఆవరణలో సర్వోదయ దినోత్సవం జరిగింది. జిల్లా కలెక్టరు శ్రీ కొండలరావు అధ్యక్షత వహించారు.

శ్రీ నరసింహారాజు సర్వోదయ ఉత్సవప్రాముఖ్యంవివరించారు. హరిజనులలో విభేదాలు, కక్షలు, నిర్మూలించడం తమ లక్ష్యమని తెలిపారు. అధ్యక్షులు మాట్లాడుతూ జాతికిగల గొప్ప సంపద మానవశక్తియేనని, దీనిని సద్వినియోగం చేసుకోవాలని సూచించారు. తరచు ఆటల పోటీలు వంటివి జరగాలని, చెప్పారు. శ్రీ ఎ. నరసింహం ప్రభృతులు మాట్లాడారు.

శ్రీ నరసింహారాజు వందన మర్పించారు. ఆటల పోటీలు బహుమతులు పంపకం జరిగాయి. భూమిలేని పేదలకు భూమి నిచ్చి పట్టాలు మంజూరు చేశారు. శ్రీ మల్లయ్య పట్టుపట్టాలు బహూకరించారు.

హరిజనులలో వివిధ శాఖలవారు సహపంక్తి విందులో పాల్గొన్నారు. హరిజనుల పెండ్లిపూరేగింపుకు కలెక్టరు అధ్యర్యం వహించారు.



Printed and Published for Nageswara Rao Estates (private) Ltd, by S. Radha Krishna, at The Andhra Patrika Press. No. 6 & 7 Thambu Chetty St., Madras-1. Editor S. Sambhu Prasad.